# భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం

## విధానాలు – వైఖరులు

### (వ్యాస సంకలనం)

సంపాదకత్వం

**గౌరవ్**

**బి.సుధాకర్**

**చార్వాకాశ్రమం**

నిడమర్రు పోస్ట్, మంగళగిరి, గుంటూరుజిల్లా

**భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం**

**విధానాలు - వైఖరులు**

**(వ్యాస సంకలనం)**


ప్రచురణ :

**29వ నాస్తిక మేళా**

ఫిబ్రవరి 13, 14, 2021

ప్రతులకు :

**చార్వాకాశ్రమం**

నిడమర్రు పోస్టు, మంగళగిరి, గుంటూరు జిల్లా.




## అంకితం

మరుగునపడ్డ మహామార్క్సిస్టు

కృషీవలుడు

ప్రగతిశీల పరిశోధకుడు

కులవ్యతిరేక ప్రతిఘటనోద్యమాల అధ్యయనవేత్త

స్వాతంత్ర సమరయోధుడు

కాలగర్భంలో నిఖార్సైన కమ్యూనిస్టు

**డా॥ కె.బి.కృష్ణ**

**(కాట్రగడ్డ బాలకృష్ణ)**

అకళంకిత అసాధారణ కృషికి

అచంచల విప్లవాభినందనలతో...

ఈ అక్షర కృతినిలా...

# భారతదేశంలో వందేళ్ళ కమ్యూనిజం !
# చార్వాకాశ్రమ చారిత్రక పరిశీలన !!

**–గౌరవ్**

**భారతదేశంలో** మొట్టమొదటి కమ్యూనిస్టులు చార్వాక, లోకాయతులు. ఈనాటి కమ్యూనిస్టులకి పెట్టుబడిదారీవర్గం భయపడ్డట్లే ఆనాటి చార్వాకులకి పాలకవర్గాలు భయపడ్డాయి. నాడైనా, నేడైనా మానవవాదమంటే మతోన్మాదానికి చుక్కెదురే. కాలంతో సంబంధం లేకుండా మనిషి పక్షాన నిలబడ్డ సామరస్య భావనలన్నీ సామ్యవాద సిద్ధాంతాలే. ఈ దేశంలో బౌద్ధం మొదలుకుని అస్తిత్వోద్యమాల వరకూ అందులో భాగమే. అయితే ఎవరొప్పుకున్నా లేకున్నా ప్రపంచంలో వివిధ ప్రాంతాలతో పాటూ ఈ దేశం మీద కూడా సుమారు వంద సం॥రాలకు పైబడి ప్రభావం చూపుతున్న విధానం, కమ్యూనిజం.

1920లో యం.యన్.రాయ్ భారతీయ కమ్యూనిస్టు పార్టీని తాష్కెంట్‌లో స్థాపించాడు. 1925లో సత్యభక్త అనే దేశభక్తుడు కాన్పూర్‌లో కమ్యూనిస్టుపార్టీ స్థాపించి మహాసభ నిర్వహించాడు. ఆశ్చర్యం ఏమిటంటే వారిరువురూ, ఇంకా ఆనాడు వారితో కలవారూ ఎవరూ కమ్యూనిస్టుపార్టీలో కొనసాగలేదు. అధికారికంగా కమ్యూనిస్టు పార్టీ ఎప్పుడు స్థాపించబడిందనే విషయంలో ఎన్ని పేచీలున్నప్పటికీ ఇండియాలో కమ్యూనిజం ప్రభావం మొదలై సుమారుగా వంద సం॥రాలు అవుతోందనేది నిర్వివాదాంశం[2]. అయితే, ఈ రోజు ప్రతీఘాత శక్తులకు నేతృత్వం వహిస్తున్న మతతత్వ సంస్థ ఆర్.ఎస్.ఎస్. కూడా 1925లో నాగపూర్‌లో మొదలైంది. ఇదో వైచిత్రి. నేనా పూర్వపరాల్లోకి పోవడంలేదు.

ఈ క్రమంలో భారతీయ సాంస్కృతిక పునర్వికాసానికి సామ్యవాద భావజాలం అందించిన ఆలోచనాధారనూ, ఆచరణా ధోరణిని మదింపు వేసుకోవడం ఈ చారిత్రక సందర్భంలో మన భాద్యత. ప్రపంచ గమనాన్ని ప్రేరేపించిన వాదాలన్నింటినీ పట్టి చూస్తే వాటి సమీక్షను కమ్యూనిజం ముందూ, ఆ తర్వాత అని విశ్లేషించేంతటి ప్రభావం సామ్యవాదం చూపింది. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, స్టాలిన్, హోచిమిన్, మావో, కేస్ట్రో ఆలోచనా విధానాలన్నీ అనేక దేశాల్లో విమర్శనాత్మకంగా చర్చించబడుతున్నాయి.

చార్వాకాశ్రమ చరిత్ర మార్క్సిజంతో ముడిపడి ఉంది. తెలుగు పెరియార్‌గా పేరొందిన రామకృష్ణ మాష్టారు ప్రధాన స్రవంతి సాంప్రదాయ భక్తి భావవాద స్రవంతికి ప్రత్యామ్నాయంగా రావణమైదానమనే నామధేయంతో ప్రగతి విద్యావనం మొదలెట్టి 45 సం॥ రాలౌతోంది. ఒకవైపు దేశంలో కమ్యూనిస్టు ఉద్యమ ఆరంభానికి మొదటడుగుపడి నూరేళ్ళవుతుండగా మరోవైపు తెలుగునేల మీద పార్టీలకి అతీతమయిన ప్రగతిశీల దృక్పథంతో కమ్యూనిస్టు భావజాల కేంద్రంగా చార్వాకాశ్రమానికి 45 ఏళ్ళు నిండటం యాదృచ్ఛిక ప్రస్తావన కాదు.

సరిగ్గా తిధులు, వారాలు లెక్కలేసి అంచనా కట్టడానికి మనమున్నది పంచాగం ప్రకారం నడిచే మన రాజ్యంలో కాదు, రాజ్యాంగం ప్రకారం నడవాల్సిన లౌకిక రాజ్యంలో ఆ లౌకికతని ఈ రోజు కాపాడుకోవాలి.

1917 రష్యా విప్లవ ప్రభావంతో ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన 'మాలపల్లి'ని బ్రిటీష్ ప్రభుత్వం నిషేధించింది. అప్పటికే తెలుగునేల మీద భక్తి ఉద్యమ ప్రభావం, గాంధేయవాదం, బౌద్ధం, మొదలయిన సంస్కరణావాద రీతులున్నాయి. 1940 కల్లా ప్రపంచంలోనే మొట్టమొదటి నాస్తిక కేంద్రాన్ని గోరా స్థాపించగా, 1943లో రాయ్ భావాలతో ప్రభావితమయిన రావిపూడి వెంకటాద్రి కవిరాజాశ్రమం స్థాపించి నాటి నుండి హేతువాద భావ వ్యాప్తికోసం కృషి చేస్తున్నారు. దాదాపు అదే కాలంలో కొండవీటి వెంకటకవి వంటి వారితోపాటూ జె.పి. లోహియావంటివారి ఆలోచనల్తో ప్రేరణపొందిన సోషలిస్టు శిబిరాలు కూడా అప్పుడప్పుడే పుంజుకుంటున్నాయ్. ఇలాంటి వికాసోపేత వాతావరణం సహజంగానే అభ్యుదయానికి నాంది.

ఈ సామాజిక చింతనా వైఖరుల్ని తొలినుండి యువకుడిగా పరిశీలిస్తున్న రామకృష్ణ, అధ్యాపకుడిగా మొదట్నుంచీ శాస్త్రీయ ఆలోచనాధారను ప్రచారం చేయడమే లక్ష్యంగా పెట్టుకున్నారు. ఆ క్రమంలో నా అభిప్రాయం ప్రకారం అభ్యుదయ రాజకీయాలకి, కమ్యూనిస్టు పార్టీలకి, ఇంకా ఇతరేతర ప్రగతిశీల సంఘాలన్నింటి ఉమ్మడి లక్ష్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఒక విశాలమయిన భావోద్యమ వేదికను ఏర్పర్చాలనుకున్నారు. ఆ దిశగా జరిగిన ఒక నిర్మాణాత్మక మహోన్నత ప్రయత్నమే, చార్వాకాశ్రమం.

కమ్యూనిజాన్ని సిద్ధాంతంగా ఆర్థిక అసమానతలకో, వర్గ పోరాటాలకో ముడిపెట్టే దృక్కోణంతో కాకుండా మొత్తం మానవ జీవన విధానాన్ని పరిపుష్టం చేసే సమగ్ర సత్యాన్వేషణా దృక్పథంగా అర్థం చేసుకోబట్టే, రామకృష్ణగారు "సాంఘిక, ఆర్థిక పోరాటాలు బొమ్మ బొరుసు వంటి" వనే నిర్ణయానికొచ్చి 'నాస్తిక మేళా'ను ప్రారంభించారు. అంతేకాదు, చార్వాక సంస్కృతిని పునరుద్ధరించాలని పిలుపునివ్వడమే కాదు, "ప్రపంచ కార్మికులారా! ఏకం కండు" అనే నినాదం ఎలా విధానంగా కాక కేవలం నినాదంగా మిగిలిపోయిందో కుమిలిపోతూ రాశారు. (చూడు: 'ప్రపంచ కార్మికులారా ఏకంకండు!' నాస్తికయుగం మేడే - 1986 బి.రామకృష్ణ కొన్ని రచనలు, పేజి-83). మనిషి మూలాలు సాంస్కృతికమైనవి. సమిష్టిజీవిగా ఏ వ్యక్తీ ఒంటరిపోరు ఎల్లప్పుడూ చేయలేడు. ఎంతగొప్ప సిద్ధాంతమయినా ఆచరణతోనే బలోపేతమౌతుంది. అందుకు పదిమంది తోడు అవసరం.

ఆ నిజాన్ని గుర్తించబట్టే నాస్తిక, హేతువాద, భౌతికవాద, పదార్థవాద, లౌకిక, సత్యాన్వేషణా మిత్రులందరి కలయిక చేసిన పనుల సమీక్షకి, చేయాల్సిన కార్యక్రమాల ప్రణాళికకి ఉపయోగపడేలా సమభావనలతో కూడిన సహృద్భావ సమావేశంగా ప్రతీ సంవత్సరం 'నాస్తిక మేళా'ను కొనసాగించే ఒక మానవీయ సత్సంప్రదాయంగా

చార్వాకాశ్రమాన్ని మలిచారు. వ్యక్తి మారితే చాలదనీ, కుటుంబం మొత్తం మంచి ఆలోచనల్ని స్వాగతించాలనే ఆలోచన ఆయనది.

వాదాలకతీతంగా మంచిని – మానవతని అన్నివైపుల నుండీ ఆహ్వానించాలన్న వైఖరితో చార్వాకాశ్రమం పెట్టి క్షేత్రస్థాయి కృషి చేసిన రామకృష్ణగారు పీడితుల పక్షాన పోరాడుతున్న విప్లవోద్యమం తనకు వెన్నుదన్నుగా నిలుస్తుందని ఆశించి నిరాశనొందారు. సాంఘికార్థిక సమానత్వానికి సాయుధమార్గమే శరణ్యమని నమ్మిన నక్సల్బరీ, ఆ వసంతగర్జన ఒరవడిని దోసిటపట్టిన శ్రీకాకుళం చారిత్రక ఉద్యమం కూడా యాభై వసంతాలు పూర్తి చేసుకున్న సమయంలో, బడుగు బలహీన వర్గాల పోరాట తాత్వికుడు శివసాగర్ (కె.జి. సత్యమూర్తి)గారితో "విప్లవోద్యమం నా ఉద్యమానికి ఎంతో సహాయపడుతుందని ఆశించాను. కాని, ప్రతీసారీ అది నన్ను నిరాశపర్చింది." అని రామకృష్ణగారు వాపోవడం, అందుకు శివసాగర్ "అవును రామకృష్ణా! నేనూ అంతే చేశాను. క్షమించు" అనడం ఖచ్చితంగా గుర్తుచేసుకోవాలి.

ఇదేదో ఇద్దరు వ్యక్తుల మధ్య జరిగిన సంభాషణ కాదు. దశాబ్దాలపాటు ఒకే సిద్ధాంతాన్ని భిన్న కోణాల్లో నమ్మి, ఆచరించిన సుదీర్ఘమయిన జీవితానుభవాల్ని సామాజిక పరిస్థితుల్ని అధ్యయనం చేసిన ఇరువురు ఉద్దండులైన ఉద్యమకారుల మనోవేదన. ఇంకా చెప్పాలంటే, భారతీయ, సాంస్కృతిక విప్లవానికి, అనుగుణంగా కులం, మతం, జండర్ విద్య మొదలైన సమస్యలపై ఒక దృక్పథాన్ని నిర్మించడంలో జరిగిన విస్మరించరాని భావజాల ఘర్షణ గురించిన పునరాలోచన. ఆలోచనోద్యమాల్ని, సాంస్కృతికోద్యమాల్ని అంచనా వేయడంలో విప్లవోద్యమాలు చేసిన పొరపాటుని రామకృష్ణ ధైర్యంగా ఎత్తిచూపడం, దానికి సాయుధ విప్లవోద్యమనేతగా పేరొందిన సత్యమూర్తి అంగీకరించి క్షమాపణ కోరడం! దురదృష్ట మేమిటంటే సత్యమూర్తికున్న స్థైర్యం ఇతర ప్రగతిశీల మిత్రులకు ఇంకా రాలేదు. లేదా వ్యవస్థ ముఖచిత్రం ఇప్పటికీ అర్థం కాలేదు!

దేశంలో రాజకీయ పార్టీలు, స్వచ్ఛంద సంస్థలు అన్నీ వేటికవి పనిచేస్తున్నాయి. వాటన్నింటికీ వేరువేరు ఆలోచనలు, ప్రాతిపదిక ఉన్నాయి. కానీ సామ్యవాద స్థాపననే విస్తారమయిన లక్ష్యంతో "ప్రపంచ కార్మికులారా ఏకంకండి" అనే నినాదంతో పనిచేస్తున్న వామపక్ష సంఘాల మధ్య మాత్రం ఐక్యత గడిచిన వందేళ్ళలో సాధ్యం కాలేదు. సిద్ధాంత విభేధాలయితే నేడు కాకపోతే రేపైనా పరిష్కరించుకోవచ్చుకానీ వ్యక్తిగత ఆస్తులపై మోజు, నాయకత్వ స్థానాలపై ఫోజులు మాత్రమే 'కమ్యూనిస్టుల ఐక్యత'కి అడ్డమొస్తున్నాయనేది బహిరంగ రహస్యం. ఈ మాట పెట్టుబడిదారీ విధానానికి మద్దతుగా సామ్యవాదంపై ఒక రాయి వేయడానికి అంటున్నది కాదు. దేశంలో సాగుతున్న కమ్యూనిస్టు పార్టీల వేర్పాటువాద ధోరణిపై విసుగుచెంది చెప్తున్న మాట.

త్యాగజీవుల కథనాల్ని గ్లోరిఫై చేస్తూ స్వంత జీవితంలో సుఖాలకు అలవాటుపడి వేదికల మీద మాత్రం విప్లవ పదజాలంతో డాంబికాలు పోయే నాయకులందరికీ సత్యమూర్తి, రామకృష్ణల త్యాగమయ జీవితం చుక్కాని. విప్లవోద్యమం వొదిలిపోయిన ప్రశ్నల్ని మేధావుల ముందుపెట్టి జవాబుల కోసం జీవితాన్నే పణంగా పెట్టిన బుద్ధిజీవులుగా ఇద్దరి కృషి అర్ధవంతమైంది. జీవితంలోని అన్ని పార్శ్వాల్ని భావజాలపు కాంతితో పరిశీలించడం తప్పనిసరనీ అప్పుడు మాత్రమే భావితరాలవారి సందేహాలకు స్పష్టత సమకూరుతుందనే నిబద్ధతే రామకృష్ణగార్ని సాంస్కృతిక లోతులు శోధించేలా చేసింది.

అందుకే విద్యావ్యవస్థలో రావాల్సిన మార్పులకి చిహ్నంగా 'చార్వాక విద్యాపీఠం' స్థాపించిన రామకృష్ణగారు ప్రాథమిక తరగతుల వారికి ఉపకరించేలా పాఠ్యగ్రంథాలు రచించారు. చిన్నప్పట్నుంచీ పసిపిల్లల మెదళ్ళని కట్టుకథలతో చిదిమేస్తోన్న పుక్కిటిపురాణాల భరతం పడుతూ మరుగునపడిన ఆది భారతీయుల గాథలకు అక్షరరూపమిచ్చారు. తెలంగాణ తాండూరు నుండి సీమాంధ్ర తుళ్ళూరు వరకూ, ప్రతీ ప్రాంతంలోనూ చార్వాకలోకాయతుల స్ఫూర్తిని రగిలిస్తూ నూతన వరవడి నిర్మించారు. పడక్కుర్చీ మేధావుల్లా కాక రాష్ట్రమంతా విస్తృతంగా పర్యటించేవారు[4].

అందుకే తెలుగునేలమీద వందేళ్ళ కమ్యూనిజం గురించిన సంవాదంలో తప్పనిసరిగా చార్వాకాశ్రమం చారిత్రకంగా నిర్వహించిన పాత్ర ప్రస్తావన ఉండాలి. ఉత్తరాంధ్రలో భారత నాస్తిక సమాజం కాకుండా ఇలా ఆశ్రమ రూపంలో స్థాపించబడిన పార్వతీపురంలో యాళ్ళ సూర్యనారాయణ ఆశ్రమం మినహా తెలుగు రాష్ట్రాల్లో భౌతికవాదోద్యమ ప్రచారానికి, అంకితమయినది చార్వాకాశ్రమం తప్పితే మరోటి ఉన్నట్లు నాకైతే తెలీదు. ఇరు తెలుగు రాష్ట్రాల్లోనే కాదు, దేశంలోనే చార్వాక లోకాయత సిద్ధాంత దృష్టితో 'మేం కమ్యూనిస్టులం' అని ప్రకటించుకున్న నాస్తిక సమాజం బహుశా ఇదొక్కటేనేమో!

మాష్టారి కృషి, రచనా వ్యాసంగం, యాత్రలు తదితర వివరాల్లోకి నేను పోవడం లేదు. అయితే భారతీయ కమ్యూనిస్టు చరిత్ర శతజయంతోత్సవం జరుపుకోడానికి సిద్ధమవుతోన్నవేళ, చార్వాకాశ్రమ స్థాపనతో రామకృష్ణగారు చూపిన దార్శనిక ఉద్యమ స్ఫూర్తిని గ్రహించడంలో, ఆచరించడంలో మనమెక్కడున్నామని బేరీజు వేసుకోవడం అవసరమని నా భావన. ఈ ప్రశ్నను కమ్యూనిస్టులు మట్టుకే కాదు, ప్రజాస్వామ్య విధానాలతో సమ్మతిస్తూ నూతన తరహా వ్యవస్థ నిర్మాణం కోసం కృషి చేస్తున్న అన్ని స్రవంతులు వేసుకోవాల్సిన అవసరం ఉంది.

అందులో భాగంగా మతోన్మాదం, కులతత్వం, పురుషాధిపత్యం, దోపిడీ దౌర్జన్యాలు, సాంస్కృతిక సామ్రాజ్యవాదం, అవకాశవాద రాజకీయాలు పెట్రేగిపోతున్న ప్రస్తుత పరిస్థితుల్లో నూతన తరహా దృష్టికోణాన్ని చార్వాకాశ్రమ అనుభవంతో ఇప్పటికైనా తెలుగునాట కమ్యూనిస్టు ఉద్యమం స్వీకరించడానికి సిద్ధంగా ఉందా?[5]

ప్రపంచవ్యాప్తంగా మార్క్సిజం చూపిన ప్రభావం ఒకెత్తయితే, భారతదేశంలో మరోఎత్తు. ఇక్కడి వైవిధ్యం, ప్రాదేశిక భిన్నత్వం, మనస్తత్వాలు వెరసి మొత్తం సాంస్కృతిక ఆవరణంపై కమ్యూనిజం చూపిన ప్రభావం చిన్నది కాదు. తెలుగునేల మీద ఎర్రజెండా రగిలించిన వేడి ఇంకా ఆరనేలేదు. ఒక సిద్ధాంతంగా మార్క్సిజాన్ని అంగీకరించడం, విభేదించడం మాటటుంచి మానవతావాదంగా పేద ప్రజలవైపూ, బలహీనుల పక్షాన తిరుగులేని దృక్పథంతో నిలబడ్డ అంతర్జాతీయ ఆధునికవాదం కమ్యూనిజం. ఈనాటికీ సామాజిక సమస్యలపై కొద్దోగొప్పో పోరాడేదీ, త్యాగాలకు స్వచ్ఛందంగా సిద్ధపడేది మానవవాద మార్క్సిస్టులేనని నా అభిప్రాయం.

భారతదేశంలో కమ్యూనిస్టు పరిణామాలు, తత్సంబంధిత చరిత్రపై నిజాయితీతో పరిశోధించాల్సిన అవసరం ఉంది. కారణాలు ఏవైనప్పటికీ వామపక్షపార్టీలు ఈరోజు సంకుచిత ధోరణుల్ని అవలంబించేంతగా దార్శనిక దృక్పథాల్ని నిర్మించుకోలేకపోయాయి. ఇది ఆ పార్టీలకో, నేతలకో, కేడర్‌కో సంబంధించిన సమస్య కాదు. మొత్తం మానవ కళ్యాణాన్ని స్వాగతిస్తున్న, అందుకోసం వారివారి పరిమితుల్లో ప్రయత్నాలు చేస్తున్న ఆలోచనాపరులందర్నీ కలిచివేస్తోన్న ప్రశ్న.

లిబరల్ యోచనాపరులు, హేతువాదులు, గాంధీయన్లు, సోషలిస్టులు, రాయిస్టులు, అంబేద్కరిస్టులు, హ్యూమనిస్టులు, డెమోక్రాట్లు... మొదలగువారంతా వారివారి ఆలోచనలతో, ఆచరణతో వ్యవస్థ మార్పుకోసం కృషిచేస్తోన్నవారే. సమాజ పురోగమనం కోసం కలిసొచ్చే సామాజిక శ్రేయోభిలాషులు, వారెవరయినా కలసి పనిచేయడానికి భేషజాలు అక్కర్లేదనే స్పృహరానిదే దేశంలోనూ, రాష్ట్రంలోనూ ప్రజా ఉద్యమాలు బలపడవు. ఈ మాత్రం ప్రజాతంత్ర ప్రయత్నాలు కూడా భవిష్యత్తులో ఇక నిలబడవు.

తెలుగునేలపై వామపక్ష భావజాల వ్యాప్తికి అంకితమయి, సంకుచిత ధోరణులకు విరుద్ధంగా మంచి ఆలోచనల్ని అన్నివైపుల నుండి ఆహ్వానిస్తూన్న ఒక ప్రజాతంత్ర నిర్మాణం చార్వాకాశ్రమం[6]. దీన్ని వేదికగా చేసుకుని ప్రస్తుతమున్న క్లిష్ట పరిస్థితుల్ని విశ్లేషిస్తూ అభ్యుదయ శక్తుల ఐక్య కార్యాచరణకి సంబంధించిన సంవాదాన్ని ఈ చిన్న సంకలనం రూపంలో ప్రారంభిస్తే బావుంటుందనే ఆలోచనను మిత్రుడు బి.సుధాకర్‌తో పంచుకుని ఫోన్‌లోనే నేననుకుంటున్న క్రమాన్ని వివరించాను. ఆయన వెంటనే ఆశావాహంగా స్పందించారు.

పది సం॥రాలకు పైబడి ఆశ్రమంతో నా అనుబంధం. నేను లేకుండా, అనివార్య కారణాల వల్ల రాకుండానే నా పుస్తకావిష్కరణలు అనేకం అక్కడ జరిగాయి. నా ఆశ్రమ జ్ఞాపకాల్నీ, నిర్వాహకుల ఆత్మీయతనూ మరోసారి తెలుపుతానుగానీ – తెలుగు రాష్ట్రాల్లోనే కాదు యావత్ దేశంలోనే మొట్టమొదటి చారిత్రక విప్లవోద్యమమైన చార్వాకం పేరుతో సాగుతున్న ఆశ్రమంగా చార్వాకాశ్రమమంటే నాకెప్పుడూ ప్రత్యేక అభిమానమే[7]. నిజానికి

మొదట్లో ఇలాంటి సంకలనం నేనే తీసుకొద్దామనుకున్నాను. కానీ చార్వాకాశ్రమం వంటి ప్రగతిశీల విశాల వేదిక ఆధ్వర్యంలో ఈ రకమైన ప్రయత్నం జరగడం ప్రధానమనిపించింది. తెలుగులోనే కాదు ఇతరేతర రాష్ట్రాల మిత్రులకు కూడా ఈ చారిత్రక సందర్భాన్ని అదనుగా తీసుకుని కార్యక్రమాలు చేయమన్నాను.

అమానుషత్వం రాజ్యమేలుతున్నచోట మానవత్వంతో కూడిన ఎంతటి పనైనా పరిగణనలోకి తీసుకోవాల్సిందే. తెలుగు రాష్ట్రాల్లోని ప్రగతిశీలశక్తుల ఐక్యత కోసం నిబద్ధతగా పట్టుబట్టి ప్రతిపాదిస్తూ ప్రచురిస్తోన్న సంకలనం ఇది. ఆది బౌద్ధం మొదలుకుని అంబేద్కర్ నవయానం వరకూ అంతా ప్రత్యామ్నాయే సాంస్కృతికోద్యమ మిత్ర ప్రవంతిలో భాగమేనని మా అభిప్రాయం. మరుగునపడ్డ మానవీయ మార్క్సిస్టు కె.బి.కృష్ణగారికి అందుకే ఈ సంకలనం అంకితమివ్వడం జరగింది[8]. అటువంటి ఎందరో మహోన్నత వ్యక్తుల జీవితాన్ని, కృషినీ వెలికితీయాల్సిన అవసరం ఎప్పటికంటే ఈ రోజు ఎక్కువుంది.

నిజానికి ఆలోచన మాత్రమే నాది. సేకరణా భారమంతా సుధాకర్‌గారే చూసుకున్నారు. సహకరించిన మిత్రులు, శ్రేయోభిలాషులందరికీ అభినందనలు. కొద్దిమంది మిత్రులు తారీఖులు, దస్తావేజుల వివరాలు అడిగారు. ఒక చారిత్రక సందర్భాన్ని పురస్కరించుకుని దార్శనిక సంవాదానికి తెరతీయటమెతప్ప తారీఖులు గుర్తుపెట్టుకొని తద్దినాల హడావుడి చేయడానిక్కాదని సమాధానమిచ్చాను.

అనేక కారణావల్ల ఈ ప్రయత్నం నాకు విశిష్టమైనదనిపిస్తోంది. సీరియస్ ఆలోచనాపరులెవరైనా వారివారి సలహాలు, సూచనలు స్వీకరించడానికి చార్వాకాశ్రమం ఎల్లప్పుడూ సిద్ధంగా ఉంటుందనడానికి ఇదో ఉదాహరణ. రోజురోజుకీ భయంకరమైన స్తబ్ధత పెరుగుతోన్న సంక్లిష్ట పరిస్థితుల్లో ఈ చారిత్రక సందర్భాన్ని పురస్కరించుకునైనా ప్రజాతంత్ర శక్తులు ఐక్యత దిశగా ఒక్కడుగేసినా, ప్రత్యామ్నాయ మానవీయ భావజాలాల పట్ల కొత్తతరం కార్యకర్తలు గుప్పెడుమంది నిబద్ధతగా సాలోచనతో సానుకూలంగా ప్రతిస్పందించినా ఈ ప్రయత్నం ఫలించినట్లే.

**కొన్ని సంప్రదించిన గ్రంథాలు, వివరణలు :**

1. మార్క్సిస్టు సిద్ధాంత దృక్పథం తెలీకపోవచ్చుగానీ ఆనాటి నుండి సమానత్వాన్ని స్వాగతించే అనేక వాదాలు వ్యాప్తిలో ఉన్నాయి. ఆ దృష్టిలో చార్వాకులు తొలి కమ్యూనిస్టులు.
2. ఆ దిశగా నాకు తెల్సి తెలుగులో సాధికారికంగా చర్చించిన గ్రంథం, ఎం.ఎన్.రాయ్– భారత కమ్యూనిజం. వివరాలకు చూడు : ఎం.ఎన్.రాయ్ – భారత కమ్యూనిజం, రావిపూడి వెంకటాద్రి, ప్రజాస్వామ్య ప్రచురణలు, తెనాలి. తొలిముద్రణ – మార్చి 1983.

3. వివరాలకు చూడు; నాస్తికదర్శిని: చార్వాక రామకృష్ణ మాష్టారి సాంస్కృతికోద్యమ ప్రస్థాన ప్రత్యేక సంచిక, జనవరి – ఫిబ్రవరి సంచిక – 2016, సంపాదకులు : డా॥ విజయ కోటేశ్వర్రావు, విశాఖపట్నం, పేజి-4, పోరుబాటసారుల ఆవాస కేంద్రం : చార్వాకాశ్రమం, రచన : శివసాగర్.

4. భావోద్యమకారుల ఇంటర్వ్యూలు మొదలుకుని వివిధ కార్యక్రమాలు, కార్యాచరణలో భాగంగా పర్యటిస్తున్నప్పుడు అనేకమంది ఉద్యమకారులతో రామకృష్ణ మాష్టారికి ఉన్న అనుబంధం, ఆయన నిత్య పర్యటన గురించి స్వయంగా విన్నాను.

5. గాంధీజి 150వ జయంతోత్సవాలు వివిధ సంస్థలు చేస్తున్నాయి. అంబేద్కర్ నేతృత్వంలోని రాజ్యాంగ శాసనం ఈ సమయంలోనే 70 సం॥రాలు పూర్తి చేసుకుంటోంది. అన్నా భావ్ సాటేవంటి మార్క్సిస్ట్ అంబేద్కరైట్‌ల శతజయంతి కూడా జరిగింది. వీటన్నింటినీ పురస్కరించుకుని భారతీయ కమ్యూనిస్టులు ఆత్మవిమర్శ చేసుకోవాలి. మార్క్స్ – 200 జయంతోత్సవాల్ని ఆశాజనకంగా చేసిన పార్టీలు ఈ రోజు ఉద్యమ ఐక్యత పై దృష్టిసారించాల్సిన సమయమొచ్చింది.

6. 100 సం॥రాలు పూర్తి చేసుకోబోతున్న అచంచల కమ్యూనిస్టు భూపతి నారాయణ మూర్తి మొదలుకొని హజరత్ ఆలీవంటి సీనియర్‌లు ఎంతోమంది చార్వాకాశ్రమ సానుభూతిపరులున్నారు. ఈ సందర్భంగానైనా వారి విలువయిన అనుభవాల్ని స్వీకరించడం అవసరం.

7. నాకు తెలిసీ మహారాష్ట్రలోని పూనా కేంద్రంగా నడుస్తున్న 'లోకాయత్' అనే సోషలిస్టు సంఘం మాత్రమే లోకాయత నుండి పేరుని స్వీకరించింది. 2016లో ఆ సంస్థ ప్రచురించిన "Rationalist, Scientific, Socialist Vivekananda" పుస్తకాన్ని అనువాదం చేసి తెలుగులో ప్రచురించిన నాటినుండి All India Socialist youth conferenceలో తెలుగురాష్ట్రాల ఉమ్మడి ప్రతినిధిగా పాల్గొన్న తర్వాతే ఆ సంస్థతో కూడా కల్సి ఈనాటిదాకా పనిచేస్తున్న విషయం పాఠకులకి విదితమే.

8. డా॥ కె.బి.కృష్ణ గురించి ఆయన కృషి గురించీ తెలుగువారికి ఆయన రచనలతో సహా అందించిన వ్యక్తి టి.రవిచంద్. డా॥ కె.బి.కృష్ణగారి రచనలు, ఆయన గురించిన రచనలు కలిపి మొత్తం ఆరు ప్రచురణలు తీసుకొచ్చారు. డా॥ కె.బి.కృష్ణ శతజయంతి (1906–2006) సందర్భంగా మిళింద ప్రచురణల తరపున ముద్రించిన కరపత్రం నుండే అంకితం పుటలోని సమాచారం తీసుకున్నాం.

# భారతదేశ విప్లవ పథంలో 'తాత్విక పునాది', 'రాజకీయ ఉద్యమం' మధ్య అన్వయింపు; జోడింపులు కుదిరాయా?

## (భారతీయ సమాజంపై 'నూరేళ్ళ కమ్యూనిజం' సింహావలోకనం సందర్భంగా)

*-పి. ప్రసాదు (పి.పి.)*

*(ఐ.యఫ్.టి.యు. జాతీయ కార్యదర్శి)*

**ఈ వ్యాస** ఉప శీర్షికలో 'నూరేళ్ళ' పద ప్రయోగం చేశాను. దాన్ని గూర్చి వివరణతో యీ వ్యాసాన్ని ప్రారంభించాలని అభిప్రాయపడుతున్నాను. ఈ ఏడాది 2020కి భారత కమ్యూనిస్టు వుద్యమానికి నూరేళ్ళు నిండిందో, తొంభైఐదేళ్ళు, నిండిందో నేటికీ ఒక చర్చనీయాంశంగానే మిగిలివుంది. అవి చర్చనీయాంశంగా వుందంటే, దాని వెనక ఒక వివాదాంశం దాగి వుందని అర్థం! ఈ వ్యాసాన్ని రాయమని కోరిన ప్రచురణకర్తలు కూడా పైన పేర్కొన్న వివాదాంశంలోకి వెళ్ళలేదని దృఢంగా అభిప్రాయపడుతున్నాను. భారతీయ సమాజంపై నూరేళ్ళ కమ్యూనిస్టు వుద్యమం ప్రభావం గూర్చి కాకుండా, నూరేళ్ళ కమ్యూనిజం ప్రభావం గూర్చి రాయమని ప్రచురణకర్తలు కోరారు. నిజానికి 'కమ్యూనిస్టు వుద్యమం', 'కమ్యూనిజం" ఒకటి కాదు. మొదటిది నిర్మాణ చరిత్ర. రెండవది, భావజాల చరిత్ర. భౌతిక పునాదికి ముందే భావజాల ప్రభావం వుంటుందని కార్యకారణ సిద్ధాంతం చెబుతుంది. భారతదేశంలో కమ్యూనిస్టు వుద్యమ ప్రారంభానికి ముందే కమ్యూనిజం యొక్క ప్రభావం వుండటం ఒక చారిత్రక షరతు. అది ఎవరి యిష్టాయిష్టాలతో నిమిత్తం లేని నియమం కూడా! భారత దేశంలో కమ్యూనిస్టు పార్టీ 1920లో పుట్టిందా లేదంటే 1925లో పుట్టిందా అనే వివాదంతో సంబంధంలేని నియమమది. 1917 నుండే రష్యా విప్లవ ప్రభావం భారత స్వాతంత్ర్యోద్యమంపై పడటం అందుకొక సాధికారిక సాక్ష్యాధారం కూడా! ఈ వెలుగులో నా వ్యాస ఉపశీర్షికలో నూరేళ్ళ పదాన్ని ప్రయోగించాను. అందుకే చరిత్ర వివాదంలోకి వెళ్ళినట్లు కాదని పాఠకలోకానికి ముందుగా విన్నవిస్తున్నాను.

నా వ్యాస శీర్షికపై మరో వివరణను కూడా యివ్వాల్సి వుందని అభిప్రాయపడుతున్నాను. ప్రచురణ కర్తలు కోరిన 'భారతీయ సమాజంపై నూరేళ్ళ కమ్యూనిజం ప్రభావం' అనే అంశం గూర్చి నేనొక నిర్ధారిత దృక్కోణంతో యీ వ్యాసాన్ని రాయడంలేదు. ఒక నిర్ధారణకు రావాలంటే, దానికి ముందు విశ్లేషణ చేయగలగాలి. విశ్లేషణ చేయాలంటే సాధికారిక చరిత్ర అధ్యయనం జరగాలి. భారతదేశ కమ్యూనిస్టు వుద్యమానికి సుదీర్ఘ చరిత్ర వుంది. దాని వెనక అంతే సుదీర్ఘ రాజకీయ చరిత్ర వుంది. దానివెనక అంతే సుదీర్ఘ సిద్ధాంత చరిత్ర వుంది. దానివెనక తాత్విక చరిత్ర కూడా వుంది. ఈ సుదీర్ఘ తాత్విక, సిద్ధాంత, రాజకీయ, వుద్యమ చరిత్రల మధ్య అన్వయింపు, జోడింపుల చరిత్ర కూడా అంతర్లీనంగా వుంటుంది. వీటన్నింటినీ అధ్యయనం చేయకుండా విశ్లేషణ, నిర్ధారణలు చేయలేము. ఈ పని వ్యక్తుల వల్ల అయ్యేది

కూడా కాదు. వ్యక్తులు చేయలేని, చేయకూడని పనిని చేపట్టజూడటం చరిత్రకు అపచారంగా మారవచ్చు. అందుకే సుదీర్ఘమైన విస్తృతమైన, లోతైన, ముఖ్యంగా సంక్లిష్టభరితమైన భారత కమ్యూనిష్టు వుద్యమ చరిత్ర విశ్లేషణ, నిర్ధారణలలోకి వెళ్లడం లేదు. అందులోని ఒక సాఫల్యాన్ని వైఫల్యంగానో; ఒక వైఫల్యాన్ని సాఫల్యంగానో పొరపాటున నిర్ధారించితే, చరిత్రకు అపచారమౌతుంది. అలాంటి క్షమించరాని చారిత్రిక అపచారం చేయకూడదనే భావనతో యీ వ్యాసరచన చేయాలని పరిమితిని విధించుకున్నాను. అందుకే నేను ఎంచుకున్న అంశంలో జోడింపు కుదరలేదని గానీ, కుదిరిందని గానీ నిర్ధారించలేదు. 'జోడింపు కుదిరిందా?' అనే సందేహాన్ని పాఠకుల ముందుచుతున్నాను. రచయితలకు గల సందేహించే ప్రజాస్వామిక హక్కుకు పరిమితమై యీ రచన చేస్తున్నాను. ఈ విషయాన్ని కూడా గమనంలో వుంచుకోవాలని పాఠకులను కోరుతున్నాను.

అసలు విషయంలోకి వెళ్ళకముందు యింతటి సుదీర్ఘ వివరణ యిస్తున్నందుకు మన్నించవల్సిందిగా ప్రచురణ కర్తలకు విన్నవించుకుంటున్నాను. ఇంతటి సంక్లిష్టభరితమైన అంశంపై రాయాలంటే చాలా భయపడ్డాను. పైగా అస్తిత్వ వుద్యమాలు ముందుకొచ్చాక యిది మరింత సంక్లిష్ట వివాదాంశంగా మారింది. అత్యంత సునిశిత రాజకీయ దృష్టితో పాటు అత్యంత సమతుల్యతా దృష్టితో రాయాల్సిన అంశమిది. అందుకే యీ సుదీర్ఘ వివరణ యివ్వకుండా రాయలేని స్థితి ఏర్పడింది. అర్థంచేసుకొని మన్నించడంతోపాటు ప్రచురణ కర్తలు దీనిని అనుమతిస్తారని ఆశిస్తున్నాను.

కారల్‌మార్క్స్ విప్లవ రాజకీయ జీవితం ప్రాథమికంగా విప్లవ రాజకీయ, వుద్యమ రంగాలతో ప్రారంభంకాలేదు. తద్భిన్నంగా ప్రాథమికంగా మరియు ప్రధానంగా విప్లవ తాత్విక రంగంతో ప్రారంభమైనది. ఇంచుమించు ఫ్రెడరిక్ ఎంగెల్స్ విప్లవ రాజకీయ జీవితం కూడా అలాగే ప్రారంభమైనది. కానీ లెనిన్, స్టాలిన్, మావోల విప్లవ జీవిత చరిత్రలు ప్రారంభమైన తీరు అందుకు భిన్నమైనవి. వారిని విప్లవ రాజకీయ, వుద్యమ రంగాలు తొలుత రాజకీయరంగ ప్రవేశం చేయించాయి. ఆ తర్వాత వారి ప్రయాణం విప్లవ తాత్విక రంగంవైపు సాగింది.

మార్క్స్, ఎంగెల్స్, ముఖ్యంగా మార్క్స్ తొలుత విప్లవ తాత్వికులుగా రూపొందారు. వారి మీద తమ సమకాలీన బ్రిటీష్ కార్మికోద్యమమైన చార్టిష్టు వుద్యమ ప్రభావంలేదని కాదు. ఇతర సమకాలీన, యూరప్ వుద్యమాల రాజకీయ ప్రభావం వారి మీద పడలేదనడం లేదు. పూర్వ విప్లవ చరిత్రలను వారు అధ్యయనం చేయలేదని కాదు. కానీ ప్రాథమికంగా మార్క్స్, ఎంగెల్స్‌లు విప్లవ తాత్విక అగ్ని సరస్సులో వికసించిన వజ్రాలు కావడం విశేషం! ఆ తర్వాతే వీరు రాజకీయ విప్లవకారులుగా, అరుదుగా విప్లవోద్యమకారులుగా (ఎంగెల్స్ ఒకింత ఎక్కువ స్థాయిలో) మారారు.

తేలిగ్గా అర్థంకావడానికి యీ విప్లవ ప్రత్యామ్నాయ ప్రక్రియను ఒక చెట్టుతో పోల్చుకుందాం. పైన పేర్కొన్న (1) తాత్విక (2) రాజకీయ (3) వుద్యమ రంగాలు లేదా

స్రవంతులను విప్లవ వృక్షంలో వర్గీకరిద్దాం. (ఇది స్థూల వర్గీకరణ మాత్రమే, సూక్ష్మవర్గీకరణలో మూడుకంటె ఎక్కువ రంగాలుంటాయి). ఇందులో తాత్వికరంగం వేరు వంటిది. రాజకీయరంగం కాండం వంటింది. ఉద్యమరంగం కొమ్మలవంటిది. సాధారణంగా చెట్టుపై భాగం దాదాపు నిత్యం కదలికలో వుంటుంది. అవే ఆచరణ లేదా ఉద్యమం! అలా నిత్య చలన శీలతతో కూడిన చెట్టు పైభాగాన్ని చూసి సాధారణంగా సమాజంలో కమ్యూనిస్టులు రూపొందుతారు. తద్భిన్నంగా కొద్దిశాతం మంది కదిలే కొమ్మలను చూసికాకుండా, కదలకుండా దాదాపు నిశ్చలంగా నిటారుగా నిలబడే కాండాన్ని చూసి కమ్యూనిస్టులుగా రూపొందుతారు. మొదటి కోవలోని కమ్యూనిస్టులు కదిలే కొమ్మల (చెట్టుపైభాగం) వైపు నుండి నిశ్చలంగా నిలిచే కాండంవైపు ప్రయాణిస్తారు. అంటే సాపేక్షిక అస్థిరత్వం నుండి స్థిరత్వం వైపుకు వారి గమనం సాగుతుంది. కానీ రెండవ కోవలోని కమ్యూనిస్టులు నిశ్చలస్థితిలోని కాండంవైపు నుండి కదిలే కొమ్మలవైపు ప్రయాణిస్తారు. అంతవరకు వారికి ఆచరణతో సంబంధం లేదు. రాజకీయంగా దృఢత్వం వుంటుంది. అలాంటి కమ్యూనిస్టులు ఆచరణలో కూడా ధృఢపడకపోతే అగ్ని పరీక్షా కాలాలలో వారు నిలదొక్కుకోలేరు. అటు కాండంవద్దా; ఇటు కొమ్మలవద్దా స్థిరపడాల్సిన ఆవశ్యకత వుంది. దీనినే సాధారణంగా 'సిద్ధాంతం – ఆచరణ' అంటారు. అయితే యిది కూడా సమగ్రం కాదు. ఈ రెండింటికే పరిమితం కాకుండా మూడో కోవకూడా వుంది. అదే తాత్విక రంగం!

భూ ఉపరితలంమీద కంటికి కనిపించే చెట్టుకు కదిలే కొమ్మలూ, కదలని కాండంతోపాటు కంటికి కనిపించని మరో విభాగం కూడా వుంటుంది. అదే వేరు! 18, 19 శతాబ్దాలలో జర్మన్ తత్వశాస్త్ర పరిశోధన అక్కడే ప్రారంభమైనది. మార్క్స్, ఎంగెల్స్‌ల కంటె ముందు హెగెల్, ఫ్యూయర్‌బా వంటి తత్వశాస్త్రవేత్తలు అలాంటి మూలం (వేరు) వద్ద సామాజిక పరిశోధనా ప్రక్రియను విశేషంగా సాగించారు. మార్క్స్, ఎంగెల్స్‌లు వారికి తొలుత శిష్యులుగా మారారు. వారి సిద్ధాంతంలోని మౌళిక కొరతలను గుర్తించి, గతితార్కిక భౌతికవాద తత్వశాస్త్రాన్ని ఆవిష్కరించారు. అప్పటికి యింకా వారిద్దరూ రాజకీయ విప్లవ కారులుగా రూపొందలేదు. కనీసం విప్లవోద్యమకారులుగా కూడా రూపొందలేదు.

1848లో తలెత్తిన యూరప్ విప్లవ వెల్లువ వారిని రాజకీయ విప్లవకారులుగా మలిచింది. కానీ 1840 నాటికే మార్క్స్‌లో 'తత్వవేత్త' మొగ్గతొడిగాడు. ఈ తాత్విక చింతనతోనే ఆచార్య వృత్తిపై ఆశలు వదులుకొని తన 23వ ఏట (1841లో) వృత్తి విప్లవకారుడిగా మార్క్స్ తన జీవితాన్ని అర్పించుకున్నాడు. అదే విధంగా మార్క్స్ ఎంగెల్స్‌ల తొలి ఉమ్మడి గ్రంథం 'పవిత్ర కుటుంబం' (హోలీ ఫ్యామిలీ) కూడా 1844లో యీ తాత్విక వెలుగులోనే రచించారు. దీనినే 'విమర్శనాత్మక విమర్శనావాదంపై విమర్శ' (Critique of critical criticism) అని కూడా అంటారు. అంతకంటె సుస్పష్టతగల తాత్విక దృష్టితో, 1845లో 'జర్మనీ ఐడియాలజీ'! గ్రంథాన్ని వాళ్ళిద్దరూ రచించారు. 1947లో మార్క్స్ ఒక్కడే రచించిన 'తత్వశాస్త్ర దారిద్ర్యం' అనే గ్రంథం యిదే వెలుగులో మరో ముందడుగు! తదనంతర కాలంలో ఎంగెల్స్ రచించిన

'యాంటీ డూరింగ్' మరియు 'ప్రకృతి గతితర్కం' గ్రంథాలు కూడా తాత్వికరంగంలో ప్రముఖమైనవి. ఈ విధంగా మార్క్స్, ఎంగెల్స్‌ల రాజకీయ జీవిత పరిణామ క్రమం తొలుత విప్లవ తాత్విక రంగంలో నిష్ణాతులుగా ఎదిగి ఆ తర్వాత రాజకీయ, రంగాలలో విప్లవకారులుగా ఎదగడం విశేషం! ఇదే నా వ్యాసాంశం! అందుకే దీనిని ప్రస్తావించాల్సి వస్తున్నది.

విప్లవ వృక్షాన్ని కూల్చివేయడం శ్రమదోపిడీ వ్యవస్థ లక్ష్యం! అందులో భాగంగా గాలిదుమారాలూ, తుఫాన్లూ వస్తాయి. గాలి దుమారాలకు కదిలే కొమ్మలూ, రెమ్మలూ విరిగిపడతాయి. కదలని కాండం మాత్రం చెదరదూ, బెదరదూ! అరుదుగా ప్రచండ తుఫాన్లు సంభవిస్తాయి. కాండం కూడా నేలకు ఒరుగుతుంది. అయినా వేరు తిరిగి చిగురిస్తుంది. రాజ్య క్రూర అణిచివేత ప్రక్రియకూ, సంస్కరణవాద ప్రలోభాలకూ కూలిపోకుండా లేదా రాలిపడకుండా విప్లవ వృక్షం వర్ధిల్లాలి. అందుకై కొమ్మలకంటె కాండం ఎంత దృఢంగా నిలిచినా సరిపోదు. వేరు మాత్రమే విప్లవ జీవాన్ని కొనసాగించగలదు. సుదీర్ఘ భారత కమ్యూనిస్టు వుద్యమం అలాంటి తాత్వికరంగం వరకూ చేరుకోగలిగిందా? ఇదే అసలు సందేహం!

శ్రామికవర్గ విప్లవాల సాధనలో నాయకుల పాత్ర ప్రధానం కాదు. ప్రజల పాత్రే ప్రధానం. అందులో కూడా తిరిగి శ్రామికవర్గ పాత్రే నిర్ణయాత్మకమైనది. ఈ పాత్ర వుద్యమ, రాజకీయ రంగాలకే పరిమితమైతే శ్రామికవర్గ విప్లవాల ఆవిష్కరణ జరగదు. తాత్విక విప్లవ పునాదులు కూడా ఏర్పడాలి. అందుకు తాత్విక మూలాలను విప్లవాలు ఆశ్రయించాల్సి వుంది. అక్కడి వరకూ ప్రయాణించే విప్లవ సూత్రాలను విప్లవ ప్రజలు లేదా శ్రామికవర్గం కనుగొనలేదు. వాటిని కనుగొనే కర్తవ్యాన్ని విప్లవ తాత్వికులే కనుగొనగలరు. చరిత్ర నిర్మాతలైన ప్రజలే విప్లవ నిర్మాతలవుతారు. కానీ విప్లవతాత్విక సిద్ధాంత ఆవిష్కర్తలు ప్రజలు కాలేరు. మార్క్స్, ఎంగెల్స్‌లు ఒకవైపునుండి మరోవైపుకు విప్లవ పథంలో ప్రయాణించి వుండొచ్చు. లెనిన్, స్టాలిన్, మావోలు మరోదిశలో ప్రయాణించి వుండొచ్చు. విప్లవపథంలో అన్వేషణ లేదా ప్రయాణ దిశ ఎటు వైపు నుండి ఎటు వైపుకు సాగిందనేది ఒక అంశమే. కానీ అదే ఏకైక అంశం కాదు. మార్క్స్, ఎంగెల్స్‌ల రాజకీయ ప్రయాణం తాత్విక రంగం (వేరు) నుండి రాజకీయ, వుద్యమ రంగాల (కాండం, కొమ్మలు) వైపుకు సాగి వుండొచ్చు. లెనిన్, స్టాలిన్ మావోల ప్రయాణం తద్భిన్నమైన దిశలో కొనసాగి వుండొచ్చు. నిజానికి అంతిమంగా తాత్విక రంగాన్ని చేరుకుందీ లేనిదీ ముఖ్యమైనది. అదే విప్లవాల ఆవిష్కరణకూ, స్థిరీకరణకూ, కొనసాగింపుకూ షరతు!

పైన పేర్కొన్నట్లు విప్లవ పథంలో మార్క్స్, ఎంగెల్స్‌ల గమన దిశకూ; లెనిన్, స్టాలిన్ మావోల గమన దిశకూ మధ్య భిన్నత్వం వుంది. అదే వారిలో విప్లవాల ఆవిష్కరణ రీత్యా వాళ్ళందరి మధ్య ఏకత్వం వుంది. దీనినే 'భిన్నత్వంలో ఏకత్వం – ఏకత్వంలో భిన్నత్వం' అనవచ్చు. ఇదే వాళ్ళందరి మధ్య నిర్దిష్ట పరంగా భిన్నత్వం, సార్వజనీన రూపంలో, ఏకత్వం వుందనవచ్చు. ఆయా దేశాలలో కమ్యూనిజం పురోభివృద్ధి క్రమానికి యీ సూత్రం ఒక

షరతుగా వుంటుంది. ఈ సూత్రం భారతదేశంలో కమ్యూనిజం పురోభివృద్ధిలో ఏ మేరకు పనిచేసిందో పరిశీలనాంశమౌతుంది.

పై సైద్ధాంతిక సూత్రాల వెలుగులో నా ముగింపు భాగంలోకి వస్తాను. భారతదేశ కమ్యూనిస్టు వుద్యమం రాజ్య అణిచివేతను ఎదిరించి నిలబడింది. అసాధారణ త్యాగాలు చేసింది. అది నిర్మించిన వర్గపోరాటాలు వేలాది యోధుల అమరత్వంతో పునీతనమైనది. అయితే తన లక్ష్యాన్ని చేరే దారిలో ఎందుకు విఫలమైనది. ఎక్కడ గురితప్పింది?

భారతీయ సమాజంపై 'నూరేళ్ళ కమ్యూనిజం' కలిగించిన ప్రభావాన్ని సింహావలోకనం చేసుకునే సందర్భమిది. మన యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా 95 లేదా నూరేళ్ళ భారత కమ్యూనిస్టు వుద్యమ విశ్లేషణ, సమీక్షల మీద ఆధారపడుతుంది. ఈ విశ్లేషణగానీ సమీక్షగానీ సమతుల్యతా దృష్టితో జరగాల్సి వుంది. ఇవి గుడ్డి భక్తితోగానీ, గుడ్డి వ్యతిరేకతతోగానీ చేపట్టే ప్రక్రియకాదు. భారత కమ్యూనిస్టు వుద్యమం తన సుదీర్ఘ చరిత్రలో చేయగలిగిన లేదా చేయాల్సిన సముచిత, సానుకూల చర్యలను ఏ మేరకు ఆయా దశలలో చేపట్టిందో నిష్పాక్షిక దృష్టితో పరిశీలించి విశ్లేషణ చేయాల్సివుంది. తద్వారా ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, నైతిక, భావజాల రంగాలలో అది సాధించిన విజయాలనూ. సత్ఫలితాలనూ నిష్పాక్షికంగా సమీక్షించాల్సి వుంది. అదేవిధంగా తన సుదీర్ఘ చరిత్రలో అది చేయకూడని చేపట్టకుండా వుండి వుండాల్సిన చర్యలను ఆయా చారిత్రిక దశలలో ఏ మేరకు చేపట్టిందో కూడా నిష్పాక్షికంగా పరిశీలించి విశ్లేషించాల్సివుంది. ఒకవైపు విజయాలు, సానుకూల ఫలితాల సమీక్షా ప్రక్రియలో 'గుడ్డిభక్తి'కి చోటు వుండకూడదు. మరోవైపు వైఫల్యాలు, అపజయాల సమీక్షా ప్రక్రియలో 'గుడ్డివ్యతిరేకత'కు తావు వుండకూడదు. ఈ రెండు దృక్కోణాలు కూడా పాక్షికమైనవే! చరిత్రకు అపచారం చేసేవే! ఈ రెండు పాక్షిక దృక్కోణాలకు తావులేని సమతుల్యతా దృష్టితో నిష్పాక్షికంగా కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర సమీక్ష, విశ్లేషణ చేయాల్సివుంది.

కమ్యూనిజాన్ని రాజకీయంగా, సైద్ధాంతికంగా, తాత్వికంగా గుడ్డిగా వ్యతిరేకించే రాజకీయ శక్తులు భారత కమ్యూనిస్టు వుద్యమంపై చేసిన, చేస్తున్న, చేయబోయే విమర్శల సమీక్షలు, విశ్లేషణలను గూర్చి యీ వ్యాసంలో ప్రస్తావించదలుచుకోలేదు. మరో రెండు కోవలకు చెందిన రాజకీయ సమీక్షకులగూర్చి ప్రస్తావిస్తాను. మొదటిది, నేటికీ కమ్యూనిస్టు వుద్యమంలోనే నిలబడి, ఆయా నిర్మాణాలలో పనిచేస్తున్న నాయకత్వ శ్రేణుల దృక్కోణం! రెండవది గతంలో కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేసి లేదా ఆకర్షితులై నేటికీ కమ్యూనిజం పట్ల సాధారణ అనుకూలతను ప్రదర్శిస్తూ, నేడు వివిధ అస్తిత్వ ఉద్యమాల్లో పనిచేస్తున్న నాయకత్వ శ్రేణుల దృక్కోణం!

మొదటి కోవకు వస్తే కమ్యూనిస్టు ఉద్యమ వైఫల్యాలు అపజయాల గూర్చి చేసే విమర్శలను సైతం స్వీకరించలేని పరిస్థితి ఏదో మేరకు వుంది. రెండో కోవలోకి వస్తే – కమ్యూనిస్టు వుద్యమం భారతీయ సమాజాన్ని ప్రభావితం చేసిన సానుకూల ఫలితాలను,

సాధించిన విజాయలను సైతం గుర్తించలేని విమర్శనా పద్ధతిని చేపడుతున్నాయి. ఇక్కడ నేను ప్రస్థావించేది 'సవిమర్శ', 'కువిమర్శ'లను గూర్చి మాత్రమే. దీనర్థం మొదటి కోవకు చెందిన వాళ్ళది 'సవిమర్శ' సైతం తగు విధంగా గుర్తించలేని స్థితి! మరోవైపు రెండవ కోవకు చెందిన వాళ్ళది 'కువిమర్శ'ను ప్రధానం చేసిన స్థితి! ఈ రెండూ పాక్షిక దృక్పథాలే. ఇవి చరిత్రకు అపచారం చేస్తాయి.

విజయాలూ, అపజయాలూ అన్ని రంగాలలో వున్నట్లే రాజకీయ రంగంలోనూ వుంటాయి. అందుకు భారతీయ కమ్యూనిస్టు వుద్యమం కూడా అతీతం కాదు. నిజం చెప్పాలంటే విజయపథంలోనే అపజయాలుంటాయి. అపజయాలు ఎదురు కాకుండా విజయాలు మాత్రమే సాధ్యం కాదు. అసలు విజయాలు పొందకుండా కేవలం అపజయాలలోనే ప్రయాణం కొనసాగేందుకు భౌతిక ప్రాతిపదిక వుండదు. ఈ జయాపజయాలతోనే రాజకీయ ప్రయాణమార్గం వుంటుంది. అసలు విజయాలే లేవనేందుకుగానీ, అపజయాలే లేవనేందుకుగానీ, రాజకీయ రంగాలలో నిర్ధారించే ప్రసక్తి లేదు. ఇది వివాదరహిత అంశం. అసలు వివాదాస్పద అంశం ఏమిటంటే, యిందులో దేనిని ఏది అంతిమంగా శాసించిందనేది మాత్రమే. భారత కమ్యూనిస్టు వుద్యమం తనకు మార్గమధ్యలో ఎదురైన అపజయాలను అధిగమిస్తూ అంతిమంగా విజయాన్ని సాధించగలిగిందా? లేదంటే, మార్గమధ్యలో సాధించిన విజయాలను కూడా హరించి లేదా అతిక్రమించి అంతిమంగా అపజయాలు నిర్ణయాత్మక స్థాయికి చేరుకున్నాయా? ఈ రెండింటిలో ఏది ముఖ్యాంశంగా మారిందనేదే వాస్తవ విశ్లేషణాంశం! అంతిమంగా విప్లవం ద్వారా రాజ్యాధికారం పొందడంలో విఫలమైనదనేది ఒక భౌతిక సత్యం.

విజయాలూ, ఓటములూ రెండు వేర్వేరు అంశాలు. కానీ, విజయాలలో ఓటములు పొందడం ఒక సూత్రమైనప్పుడు అదే ఒకే అంశమౌతుంది. అదేవిధంగా ఓటముల ద్వారానే విజయాలు పొందే సూత్రం కూడా ఒకే అంశమౌతుంది. వీటిని గతితార్కిక చింతనతో పరిశీలిస్తే 'ఒకటిలో రెండు'; 'రెండులో ఒకటి'గా మారతాయి. 'ఒకటి లేని రెండు' వుండనట్లే; 'రెండు లేని ఒకటి' కూడా వుండదు. వీటినే 'ఏకం' మరియు 'ద్వంద్వం' అంటారు. ఈ రెండింటి మధ్య 'ఐక్యత', 'వైరుధ్యం' వుంటాయి. ఒకవైపు ప్రక్కప్రక్కనే వుంటాయి. మరోవైపు ఎదురెదురుగా వుంటాయి.

దీనినే 'ఏకత్వంలో భిన్నత్వం – భిన్నత్వంలో ఏకత్వం' అను దృక్కోణమంటారు. సుదీర్ఘ భారత కమ్యూనిస్టు వుద్యమంలో మంచి, చెడుల సమీక్షకూ, విశ్లేషణకూ యీ తరహా గతితార్కిక దృక్కోణం ఆవశ్యకమైనది. అప్పుడు మాత్రమే చరిత్రకు అపచారం జరగదు. దురదృష్టవశాత్తు 'ద్వంద్వంలో ఏకం' – ఏకంలో ద్వంద్వం' బదులు నేడు చారిత్రిక సమీక్షకు 'ఏకం' వినియోగించబడుతోంది. దీనివల్ల ఒకవైపు గత వైఫల్యాలకు మూల కారణాలను గుర్తించకుండా

‘గతం మొత్తం సమర్ధనీయమే’ అనే పాక్షిక గుణపాఠాలకు దారితీస్తున్నది. మరోవైపు గత విజయాలను గుర్తించకుండా ‘గతం మొత్తం పనికిమాలినది’ అనే మరో తరహా పాక్షిక గుణపాఠాలకు దారితీస్తున్నది. ఈ రెండు సమీక్షా ప్రక్రియలలో ‘ఏకం’ మాత్రమే వుంది. ‘ద్వంద్వం’ కొరవడింది. ఈ పాక్షిక విశ్లేషణ ప్రక్రియతో భారతీయ సమాజం మీద నూరేళ్ళ కమ్యూనిజం యొక్క ప్రభావాన్ని సరిగ్గా నిర్ధారించలేము.

ఇక వ్యాస ఉపసంహారంలోకి వస్తున్నాను. భారత కమ్యూనిస్టు వుద్యమం విఫలమైనదనుటలో సందేహంలేదు. ఇది పై రెండు కోవల వాళ్ళు అంగీకరిస్తున్న భౌతిక సత్యం. అయితే అదో సహజ పరిణామంగా భావించడం యాంత్రికవాదమవుతుంది. విప్లవావిష్కరణ జరక్కపోవడం ఒక సహజ చారిత్రిక పరిణామంగా నిర్ధారించడమంటే, అది రాజకీయ ఆత్మహత్యా సాదృశ్యమైనది. అలా సమీక్షిస్తే యిక ముందు కూడా భారతదేశంలో ఎప్పటికీ విప్లవావిష్కరణ జరగదు. శ్రామికవర్గ రాజ్యాధికార సాధన శాశ్వత మధుర స్వప్నంగానే మిగిలిపోతుంది. అది సరికాదు. వజ్రాన్ని వజ్రంతోనే కోయగలమన్నట్లు, కమ్యూనిస్టు వుద్యమ వైఫల్యానికి కారణాలను కూడా కమ్యూనిస్టు సిద్ధాంత దృష్టితోనే విశ్లేషించాల్సి వుంది. దానికి ఏ కమ్యూనిస్టేతర దృక్కోణాలు కూడా సరిపోవు. కమ్యూనిస్టు సిద్ధాంత వెలుగు అంటే దాని తాత్విక రూపమైన గతితార్కిక దృక్కోణం వెలుగుగా భావించాల్సివుంది. దాని వెలుతురులోనే సమగ్ర సమీక్ష, శాస్త్రీయ గుణపాఠాలు సాధ్యపడతాయి.

కమ్యూనిస్టు వుద్యమంలో ‘సిద్ధాంతం’, ‘ఆచరణ’ పరస్పర ఆధారిత అంశాలే! అదేవిధంగా (1) తాత్విక (2) రాజకీయ (3) వుద్యమ (4) నిర్మాణ రంగాలపై అది ఆధారపడి పురోగమిస్తుంది. ఒకవైపు స్థూలంగా రెండూ పరస్పర ఆధారిత అంశాలైన ‘సిద్ధాంతం’, ‘ఆచరణ’పై దాని పురోగమనం ఆధారపడుతుంది. మరోవైపు పైన పేర్కొన్న ‘నాలుగు, పరస్పర అంశాల మధ్య సంబంధాలపై కూడా ఆధారపడుతుంది. ఇక్కడే ‘అన్వయింపు మరియు జోడింపు” అంశాలు ముందుకొస్తాయి. అంతిమ పరిశీలనలో కమ్యూనిస్టు వుద్యమ సాఫల్య, వైఫల్యాలకు కమ్యూనిజం లేదా కమ్యూనిస్టు సిద్ధాంతం కారణం కావు. వాటిని ఆయా దేశాల, భౌతిక పరిస్థితులకు అన్వయించడమే కారణమౌతుంది. భారతదేశంలో విప్లవావిష్కరణ జరగకపోవడానికి కూడా అదే కారణం. అదే విశ్లేషణాంశం కావాలి.

నిర్మాణపరంగా, వుద్యమ పరంగా ఒక దశలో భారత కమ్యూనిస్టు వుద్యమం గొప్ప పురోగతిని సంధించింది. శ్రామిక వర్గాలలో ఆశలనే కాకుండా విశ్వాసాన్ని కూడా కలిగించింది. త్వరలో దేశంలో శ్రామికవర్గ విప్లవావిష్కరణ సాధ్యమౌతుందనే ఆశను కూడా కలిగించింది. ఈ ఆశలన్నీ 1960వ దశాబ్దానికి ముందుమాట! ముఖ్యంగా స్వాతంత్రోద్యమ దశలో అలాంటి మహత్తర పరిస్థితి ఏర్పడింది. ఇది యీ వ్యాస రచయితగా నా స్వీయ ఆకాంక్షతో చెబుతున్న మాటకాదు. అదో భౌతిక సత్యం! అదో చారిత్రిక నిజం! అయితే అంతిమంగా దాని వైఫల్యాలకు

కారణం శత్రువర్గంకాదు. రాజ్యం సాగించిన అణిచివేత కారణం కాదు. కమ్యూనిస్టు వుద్యమం తన అంతర్గత వైరుధ్యాలను తాను, పరిష్కరించుకోలేని పరిస్థితే దాని వైఫల్యానికి ప్రధాన కారణం! దీనికి మూలకారణం సార్వత్రికంగా భావించే కమ్యూనిస్టు వుద్యమ చీలికలు కాదు. తన అంతర్గత వైరుధ్యాలకూ, వివాదాలకూ, చివరకు చీలికలకూ మూలకారణాలను తాత్విక సిద్ధాంత వెలుగులో పరిష్కరించుకోలేకపోవడమే!

ప్రపచంలో, దాదాపు మిగిలిన దేశాలన్నింటి సామాజికవర్గ పొందికకూ, భారత ఉపఖండ సామాజికవర్గ పొందికకూ మధ్య తేడాలున్నాయి. 'మార్క్సిజాన్ని భారతదేశ పరిస్థితులకు అన్వయించే సందర్భంలో యీ ప్రత్యేక వర్గపొందికను పరిగణనలోకి తీసుకోవాల్సి వుంటుంది. ఇక్కడ వున్న వర్ణ వ్యవస్థ మరెక్కడాలేదు. ఇక్కడ ఏర్పడ్డ వర్గ పొందికలో వర్ణపొందిక కూడా అంతర్భాగంగా వుంది. మార్క్సిజానికి వర్గం సార్వత్రిక అంశం, వర్ణం నిర్ధిష్ట అంశం. ఈ నిర్ధిష్ట అంశాన్ని సార్వత్రిక అంశంతో అన్వయింపు జరగాల్సి వుంది. ఈ అన్వయింపులో ఏ మేరకు లోపం జరిగితే, ఆ మేరకు ఆచరణలో (వుద్యమ, నిర్మాణ రంగాలు) కూడా దాని దుష్ఫలితాలుండటం సహజమే. అయితే యీ అంశం తాత్విక రంగంలోకి వస్తుంది. హెగెల్, ఫ్యూయర్‌బా తాత్విక చింతన నుండి మార్క్స్, ఎంగెల్స్‌లు వేరుపడి గతితార్కిక చింతనను అభివృద్ధి చేయడం తెలిసిందే. అదేవిధంగా సాధారణ గతితార్కిక చింతనను భారతీయ సామాజిక పరిస్థితులకు అనుగుణ్యంగా తగు సూత్రీకరణలతో మరింత విస్తరీకరించి వుండాల్సింది. అవి అసలే జరగలేదని కాదు. తగిన స్థాయిలో మార్క్సిజం భారతీయీకరణ తాత్వికరంగంలో జరగలేదని భావించవచ్చు. తాత్విక రంగంలో మార్క్సిజం 'భారతీయీకరణ' (ఇండియనైజేషన్ ఆఫ్ మార్క్సిజం) జరగడంలో ఏ మేరకు వైఫల్యం వుంటే దాని వైఫల్యాలు అనివార్యంగా రాజకీయ, వుద్యమ నిర్మాణ రంగాలలో ప్రతిఫలిస్తాయి. ఒకవేళ భారతీయీకరణ జరిగిన మేరకు కూడా తగు విధంగా ఆచరణకు అన్వయించకపోతే యీ వైఫల్యాల తీవ్రత మరింత ఎక్కువ స్థాయిలో కూడా వుండొచ్చు. వుండటం సహజం కూడా! అదే భారత్‌లో కమ్యూనిస్టు వుద్యమ వైఫల్యానికి కారణం కావచ్చు.

పొరపాటు జరిగిన చోటే, వాటిని గుర్తించాలి. ఒకచోట వైఫల్యాలు జరిగితే మరోచోట కారణాలను వెదికితే ఫలితం వుండదు. నాగటికర్రను కందిచేనులో వదిలేసుకొని, కందిపప్పును ఉడికించి, గిన్నెలో వెదికితే దొరకదు. తాత్విక రంగంలోని పొరపాట్లకు కారణాలను రాజకీయ, నిర్మాణ, వుద్యమ రంగాలలో వెదికితే దొరకవు. పైగా తాత్విక దృష్టిని ఆచరణకు అన్వయించలేకపోయినా; ఆచరణను తాత్వికతకు జోడించలేకపోయినా పురోగతి సాధ్యపడదు. అక్కడ జరిగిన పొరపాట్లను గుర్తించకుండా రాజకీయ, వుద్యమ, నిర్మాణరంగాలలో అసాధారణ త్యాగాలతో సాధించిన పురోగతిని తప్పుపట్టడం వల్ల ఫలితంలేదు. అక్కడ జరిగిన పొరపాట్లను తప్పు పట్టకూడదని కూడా కాదు. కానీ మూలం అక్కడ లేదు.

నూరేళ్ళ కమ్యూనిజం భారతీయ సమాజాన్ని వివిధ దశలలో వివిధ రంగాలలో ఎనలేని విధంగా ప్రభావితం చేసింది. అసంఖ్యాక సమరశీల పోరాటాలూ, రక్తతర్పణలూ, ప్రాణార్పణలూ, శ్రమదోపిడీ రాజ్యరూపాలను మార్పించగలిగింది. భారత రాజ్యాంగ రచనలో కూడా ప్రతిఫలించింది. నేడు ఫాసిజం పైచేయిని సాధిస్తున్న చారిత్రిక సందర్భంలో దానికి వ్యతిరేకంగా రాజ్యాంగ హక్కుల పరిరక్షణోద్యమం తలెత్తుతున్నది. అందులో కూడా నిన్న కమ్యూనిజం సాధించిన ఫలితాలున్నాయి.

1950లో భారత రాజ్యాంగం ఏర్పడింది. దాని ఉపరితల కట్టడంలో భారత కమ్యూనిస్టు వుద్యమం సాధించిన ఫలితాలు యిమిడి వున్నాయి. దాని పునాది శ్రమ దోపిడీ వ్యవస్థను పరిరక్షించే విభాగంతో వుంది. ఒకవైపు దాని ఉపరితలంలోని సానుకూల రాజకీయ, సామాజిక అంశాలను వినియోగించుకుంటూనే; మరోవైపు దాని పునాదుల్ని కూల్చివేసి దాని స్థానంలో విప్లవ రాజ్యస్థాపన చేయాలని ఆనాటి సామ్యవాద వుద్యమం భావించింది. అదేవిధంగా దాన్ని కూల్చివేసి, ఆ స్థానంలో హిందుత్వ రాజ్యస్థాపన చేయాలని ఆర్.యస్.యస్. భావించింది. నిజం చెప్పాలంటే, తీవ్ర విప్లవ దృక్పథంతో భారత రాజ్య వ్యవస్థను సాయుధంగా కూల్చే లక్ష్యాన్ని నాటి కమ్యూనిస్టులు ప్రకటించారు. ఆర్.యస్.యస్. కూడా తీవ్ర ప్రగతి వ్యతిరేక దృక్పథంతో కూల్చాలని ప్రకటించింది. రెండూ సాయుధ పంథాలనే ప్రకటించాయి. కమ్యూనిస్టులలో ప్రధాన స్రవంతి తమ సాయుధ పంథాను విడనాడింది. రాజ్యవ్యవస్థలో వుంటూ, దాన్ని సమూలంగా సంస్కరించగలనని భావించింది. కానీ ఆర్.ఎస్.ఎస్. మాత్రం తాము కూల్చాలనుకున్న రాజ్యవ్యవస్థను ఆధారం చేసుకొని ఆరున్నర దశాబ్దాల తర్వాత రాజ్యధికారానికి వచ్చింది. రాజ్యాధికారంలో వుంటూనే, రాజ్యవ్యవస్థను కూల్చే ప్రక్రియను నేడు చేపడుతున్నది.

నిన్నటి కమ్యూనిస్టుల కృషి ఫలితంగా 70 ఏళ్ళ క్రితం రాజ్యాంగ ఉపరితలం సానుకూలంగా నిర్మాణమైనది. ఇప్పుడు ఆ ఉపరితలానికి కూడా భద్రత కరువైనది. అందుకే కమ్యూనిస్టులు గతంలో తమ కృషి వల్ల రాజ్యాంగంలో చేరిన సామాజిక రాజకీయ హక్కుల పరిరక్షణకోసం కూడా పోరాడాల్సిన పరిస్థితులలోకి నెట్టబడ్డారు. ఇప్పుడు అది కూడా ఓ ముఖ్య కర్తవ్యంగా మారింది. అది చేపట్టకుండా సుదూర విప్లవ రాజ్యస్థాపన కూడా జరగని స్థితి ఏర్పడింది. గాన భారతీయ సమాజంలో కమ్యూనిజానికి కాలం చెల్లలేదు. పైగా సజీవమైనవిగా పునరావిష్కరణ జరుగుతోంది. తాత్వికరంగంలో గతంలో జరిగిన వైఫల్యాల సమీక్షకూ, వాటి దిద్దుబాటుకూ పూనుకునేందుకు వర్తమాన వుద్యమ పునరావిష్కరణ వుపయోగపడుతుందని ఆశిద్దాం! కమ్యూనిజం నూరేళ్ళ తర్వాత తన గత విఫల స్థానాలనుండి పునర్నిర్మాణానికీ, విప్లవాల పునరావిష్కరణకూ దారితీస్తుందని ఆశించుదాం.

# సకల పోరాట ఉద్యమశక్తులు ఏకతాటిపైకి రావాలి !

**- ముప్పాళ్ళ భార్గవశ్రీ**

**భారత** కమ్యూనిస్టు పార్టీకి 2020 నాటికి వంద సంవత్సరాలు నిండుతున్న సందర్భంగా భావ విప్లవరంగం ఎదుర్కొంటున్న సవాళ్ళను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించడం అవసరం. ఎందుకంటే పురోగామిదశలో వుండాల్సిన భావజాలం తిరోగామి స్థితిలో ఉండటానికి ముఖ్యకారణం భారత కమ్యూనిస్టు పార్టీ నిర్వహించాల్సిన కర్తవ్యాలను నిర్వహించడంతో వెనుకపట్టు పట్టింది. దీనికి కారణం భా.క.పా. అనేక సమస్యలకు గురికావటమే గాక చివరికి ముఖ్యమైన రాజకీయ, సిద్ధాంత సమస్యలపై విడిపోయి 1964లో సిపియంగా, సిపియం విడిపోగా మిగిలినదే సిపిఐ, 1968లో యం.యల్ పార్టీలుగా ఏర్పడ్డాయి. మార్క్సిజం– లెనినిజం – మావో ఆలోచనా విధానం ప్రాతిపదికగా ఏర్పడిన యం.యల్. పార్టీలు విడిపోయి 20కి పైగానే కొనసాగుతున్నాయి.

విడివిడిగా ఉన్న పార్టీలు వాటివాటి పంథాల ప్రకారం ఎవరి స్థాయిలో వాళ్ళు ప్రజాసమస్యలపై కార్యక్రమాలు నిర్వహిస్తున్నప్పటికీ శతృవును ఓడించే విధంగా బలమైన ప్రజా ఉద్యమ నిర్మాణం జరగటంలేదన్నది వాస్తవం. కనీసం ముఖ్యమైన ప్రజాసమస్యలపై ఐక్య కార్యాచరణను వామపక్ష, విప్లవశక్తులు కొనసాగించలేని దుస్థితి కొనసాగటం శోచనీయం. మనం ఒక శక్తిగా ఉద్యమాలు చేయలేని స్థితిలో పడితే ఉద్యమాల పరంగా ఏర్పడిన ఖాళీలోకి అనేకం జొరబడి వచ్చేస్తాయి. అలా జొరబడి వచ్చిన వాటిల్లో ముఖ్యమైనది దళిత సమస్య. దళిత సమస్య రావడం అంటే దానితోపాటు అనేక అస్తిత్వవాదాలు ముంచుకొచ్చాయి. ఈ వాదాలన్నీ ఆధునికానంతర వాదాలుగా రూపుదిద్దుకొన్నాయి.

ఈ ఆధునికానంతర వాదాల వెలుగులో అస్తిత్వవాదాలు నేడు ఒక ఉచ్ఛ స్థితిలో కొనసాగుతున్నాయి. ఈ దండలో దారం లాగా దళితవాద ఉద్యమాలు అనేక రూపాల్లో సాగుతున్నాయి. దళితవాద అస్తిత్వ ధోరణులు ఎంతవరకు వెళ్ళాయంటే కమ్యూనిస్టు పార్టీలను దళిత ఉద్యమ వ్యతిరేకులుగా ముద్రలువేసి ప్రచారం చేస్తున్నాయి. పీడితుల్లో అత్యధికంగా ఉన్న దళితుల విముక్తి కోసం ఆనాటి కమ్యూనిస్టుపార్టీ చండ్ర రాజేశ్వరరావు, పుచ్చలపల్లి సుందరయ్య, దేవులపల్లి, తరిమెల నాగిరెడ్డి లాంటి వారి నాయకత్వాన అలుపెరగని పోరాటాలు సాగించారు. ఈ ఉద్యమాల ఫలితంగా అనేక మంది దళితులు కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకులుగా వెలుగొందారు. దళితులకు ఆర్థిక విముక్తి ఎంత ప్రధానమైనదో సాంఘిక విముక్తి కూడా అంతప్రధానమైనదని, కులనిర్మూలన కోసం అనేక ఆచరణాత్మక కార్యక్రమాలను ఆనాటి పార్టీ ధీటుగా, అంకిత భావంతో నిర్వహించింది.

గుడివాడలో పార్టీ నాయకుడు అట్లూరి శ్రీమన్నారాయణ పాకీ వాళ్ళ సమస్యలపై నిరంతరంగా ఆందోళనలు కొనసాగించి వారిని సంఘటితం చేసిన ఫలితంగా ఆయన్ని ఆ ప్రాంత ప్రజలు పాకీ శ్రీమన్నారాయణగా ప్రేమగా పిలుచుకొనేవారు. విజయవాడలో పార్టీ నాయకుడు ఎల్.వి.రత్నం పాకీ వాళ్ళ సమస్యలపై నిరంతరంగా పనిచేయడమే గాక వాళ్ళతోపాటు జీవించి చివరికి పాకీ కుటుంబానికి చెందిన అమ్మాయినే పెళ్ళి చేసుకొన్నాడు.

భూపతి ఎల్లారావు, మీసాల వెంకట్రావు లాంటి రెల్లి కులస్తులు పాకీ కార్మికుల సమస్యలపై ఉద్యమాలు నిర్మించి కమ్యూనిస్టు పార్టీ నాయకులుగా ఎదిగారు. ఇలాంటి ఉదంతాలు ఆనాడు ఏ ప్రాంతం వెళ్ళినా వినిపించేవి. పీడితుల్లో భాగంగా దళితుల సమస్యలను ఉద్యమ కర్తవ్యంగా చేపట్టి అనేక విజయాలు సాధించిన కమ్యూనిస్టులను నేడు కొన్ని దళిత సంఘాలు తమ వ్యతిరేకులుగా ఎందుకు చూస్తున్నాయి?

కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన చీలికల ఫలితంగా పీడితవర్గాల ఉద్యమాలు శక్తివంతంగా ఏకోన్ముఖంగా సాగని స్థితిలో ఏర్పడ్డ ఖాళీలోకి అస్తిత్వవాదాలు చొచ్చుకు వచ్చాయి. ఈనాడు 'దళిత' అనే పదం విస్తృతంగా వాడుకలోకి రావడానికి 1970లలో బొంబాయి ప్రాంతం పునాదిగా దళిత పాంథర్స్ ఉద్యమం పుట్టుకు వచ్చింది. 1954-68 ప్రాంతాల్లో అమెరికాలో నల్లజాతి ప్రజలు వివక్షకు వ్యతిరేకంగా సాగిన బ్లాక్ పాంథర్స్ ఉద్యమం ఇక్కడి శక్తులకు ప్రేరణగా నిలిచింది. బ్లాక్ పాంథర్స్‌ను దళిత పాంథర్స్‌గా పేరు మార్చి 1973లో ప్రణాళికను ప్రకటించి దానిలో మార్క్సిజం - బుద్ధిజంల ప్రాతిపదిక మీద కులనిర్మూలన సాగిస్తామని ప్రకటించారు. ఢసాల్, పవార్, అరుణ్ కాంబ్లేల నాయకత్వాన ఏర్పడిన ఈ ఉద్యమం బొంబాయి నుంచి ఇతర రాష్ట్రాలలో కార్యకలాపాలను సాగించింది. ఈ ఉద్యమానికి సంబంధించిన కవితలు, వ్యాసాలతో 'విరోధ్' అనే పత్రికను కూడా నడిపారు. అయితే ప్రణాళికలో మార్క్సిజం ప్రాతిపదికగానే ఉద్యమం కొనసాగాలని కొందరు, బుద్ధిజం ప్రాతిపదికగానే కొనసాగాలని మరి కొందరు తీవ్రంగా పట్టుపట్టడం, 1975లో ఇందిరాగాంధీ ప్రభుత్వం విధించిన అత్యవసర పరిస్థితి వలన సంస్థ నాయకత్వంపై తీవ్ర నిర్బంధం కారణంగా 1977లో ఈ సంస్థను రద్దు చేస్తున్నట్లు దళిత పాంథర్స్ నాయకులు ప్రకటించారు. దళిత పాంథర్స్ ఉద్యమాన్ని రద్దుచేసిన తర్వాత భారతీయ దళిత పాంథర్స్ పార్టీని ఎమర్జన్సీ తర్వాత కాంబ్లే తదితరులు ఏర్పాటు చేసి కొంతకాలం నడిపించగల్గారు. అయితే 'దళిత' అనే పదం ఈ ఉద్యమం నుంచే మొదటిసారిగా ఉనికిలోకి వచ్చి వాడుకపదంగా బహుళ ప్రచారంలోకి వచ్చింది. అయితే ప్రభుత్వాలు మాత్రం పేదవర్గాలను షెడ్యూల్ కులాలు, తెగలు గానే వ్యవహరిస్తున్నాయి.

వివిధ రకాల అస్థిత్వ ఉద్యమాలలో భాగంగానే దళిత ఉద్యమాలు పుట్టి పెరుగుతూ వస్తున్నాయి. అస్థిత్వ ఉద్యమాల స్థితి ఏ దశకు వెళ్ళిందంటే మాజాతి సమస్యలను మేమే పరిష్కరించుకొంటాం, ఎవరి నాయకత్వాలు ఎవరి దయాదాక్షిణ్యాలు అవసరం లేదన్న స్థితికి వెళ్ళాయి. ఆ విధంగా పీడిత వర్గాల మధ్య ఐక్యతకు గండికొట్టడమే గాక పీడితవర్గ ఉద్యమాలే ఊపిరిగా బ్రతికిన కమ్యూనిస్టు పార్టీలను ద్రోహులుగా చిత్రించే స్థితికి కొన్ని దళిత సంఘాలు, కొందరు దళిత మేధావులు వెళ్ళారు. వీటిలో కొన్ని దళిత సంఘాలు ఎక్కడి వరకు వెళ్ళాయంటే పాలకవర్గ పార్టీల పల్లకీలను మోసే బోయీలుగా మారి తను జాతి ప్రజలకే ద్రోహం చేసే విధానాలను కొనసాగిస్తున్నాయి. కమ్యూనిస్టు పార్టీలు కొన్ని దళిత సంఘాలు వేస్తున్న నిందనలను త్రిప్పికొట్టాల్సింది పోయి, ఆ నిందనలను పోగొట్టుకోవాలనే పేరుతో లాల్-నీల్ జెండాల సిద్ధాంతాన్ని తీసుకొచ్చి ప్రచార జాతాలు నిర్వహిస్తూ ప్రచార రథాలకు లాల్-నీల్ జెండాలను కట్టి ఊరేగుతున్నారు. ఈ జాతాలు నిర్వహిస్తున్న సిపిఐ, సిపియం పార్టీలు తాము ఏర్పాటు చేసిన రెండు రాష్ట్రస్థాయి దళిత సంఘాలు కల్గివుండి కూడా పార్టీల పేరుతో లాల్ -

నీల్ జెండాలను ఊరేగించటం ఏమిటి? దీనిలో పార్లమెంటరీ రాజకీయ ప్రయోజనాలు ఉన్నాయన్నది దాచేస్తే దాగని సత్యం. ఈ కార్యక్రమాన్ని అమలు జరపడంలో సి.పి.యం. అత్యుత్సాహంగా ఉంది. ఎర్రజెండా ఉనికిని దెబ్బతీయకుండా దళితులు సాగిస్తున్న ఉద్యమాలను ప్రజాసంఘాల ఐక్యవేదికల నాయకత్వాన సాగేలా అందుకు తమ శక్తులు కేంద్రీకరించి పనిచేసేలా కార్యక్రమాలను కమ్యూనిస్టు పార్టీల నాయకత్వాలు రూపొందించు కోవటం అవసరం. ఇలాంటి ఆచరణకు లక్ష్మింపేట దళితుల పోరాటం ఆదర్శంగా నిలుస్తుంది. 2012లో శ్రీకాకుళం జిల్లా రాజాం మండలంలోని లక్షింపేటలోని దళితులు తమ భూములకోసం నిలబడితే అగ్రకుల దురహంకారశక్తులు దళితవాడపై మారణాయుధాలతో దాడిచేసి 5గురు దళితులను పొట్టనపెట్టుకొన్నారు. భూమికోసం దళితులు సాగించిన పోరాటానికి సంఘీభావ ఉద్యమాలు అప్పటి ఉమ్మడి రాష్ట్రంలో వెల్లువెత్తాయి. ప్రముఖ దళితనాయకుడు ప్రజాతంత్రవాది బొజ్జా తారకం నాయకత్వాన "లక్ష్మిం పేట దళిత పోరాట సంఘీభావ కమిటీ" ఏర్పడి లక్ష్మింపేటలోనే న్యాయవిచారణ జరపాలని, దళితులకు చెందిన భూములను ఇప్పించాలని, దళితులను చంపిన నేరస్తులను కఠినంగా శిక్షించాలన్న ముఖ్యమైన డిమాండ్లు సాధన కోసం రాష్ట్ర వ్యాపితంగా ఉద్యమం వివిధరూపాల్లో నిరంతరాయంగా సాగింది. ఈ ఆదర్శవంతమైన ఉద్యమంలో సింహాద్రి ఝాన్సీగారి నాయకత్వానగల రైతుకూలీ సంఘం (ఆం.ప్ర) ఉద్యమం మొదలు నుండి చివరి వరకు తమ సంఘం శ్రేణులను పూర్తి స్థాయిలో పాల్గొనేలా చేసి క్రియాశీలక పాత్ర నిర్వహించింది. ఈ పోరాట కమిటీలో రాష్ట్రంలోని దాదాపు అన్ని ప్రజాసంఘాలు జతకలిసి నిరంతరాయంగా ఉద్యమంలో పాల్గొనటం ద్వారా పోరాటకమిటీ సాగించిన ఉద్యమానికి మరింత వన్నెతెచ్చాయి. లక్ష్మింపేట ఉద్యమాన్ని కేవలం ఉదాహరణగానే ప్రస్తావించటం జరిగింది. ఇలాంటి ఉద్యమాలు రాష్ట్రంలో మరికొన్ని సాగాయి.

కొన్ని దళిత సంఘాలు, కొందరు దళితమేధావులు దళితుల సమస్యలను దళితులే పరిష్కరించుకొంటారన్న అస్థిత్వవాదాలను ప్రచారం చేస్తున్నారు. ఈ సమాజంలో అభివృద్ధికి కులం అడ్డుగోడలుగా ఉంటే ఆ కులాలకు చెందిన అస్థిత్వవాదులే అడ్డుగోడలుగా తయారవటం విచిత్రంగా ఉంది. సమాజం సృష్టించిన అడ్డుగోడలను కూల్చాలంటే సమాజంలోని అన్ని వర్గాల పీడితులు సమైక్య, సంఘటిత పోరాటం చేయటం అనివార్యం. అలానే సమాజ అభివృద్ధికి ఆటంకంగా ఉన్న మతం, కులం, అన్యవర్గ ధోరణులపై ఎవరి స్థాయిలో వారు వ్యక్తులుగా, సంఘాలుగా పోరాటాలు చేయాల్సిందే. వాటికి సంబంధించిన పోరాట సాహిత్య, సాంస్కృతిక కృషిని కొనసాగించాల్సిందే! అలాంటి ఉద్యమ ప్రయాణం సాగుతుండబట్టే దుష్టశక్తులను, అప్రజాస్వామిక శక్తులను ప్రశ్నించి కొంతమేరకైనా ఎదుర్కోగల్గుతున్నాం. నాస్తిక సంఘాలు, హేతువాద సంఘాలు, పౌరహక్కుల సంఘాలు, సాంస్కృతిక సంఘాలు విడివిడిగా, అవసరమైనప్పుడు కలిసి సమైక్యపోరాటాలు చేస్తున్నాయి. ఈ సంఘాల ఉద్యమ కృషి ఫలితంగా సమాజం గురించి ఆలోచించే పురోగామి శక్తులు, శాస్త్రీయ అవగాహనను పెంపొందించుకొంటున్న శక్తులు, ప్రజాస్వామిక, ప్రజాతంత్ర శక్తులు పెరుగుతున్నాయి. ఒక వాస్తవం ఏమంటే ఈనాడు ఏ కమ్యూనిస్టు పార్టీ అయినా, యం.యల్. పార్టీలు అయినా

వాటిల్లోని నాయకులు మొదలుకొని కార్యకర్తల వరకు ఎక్కువ భాగం నాస్తిక, హేతువాద తదితర సంఘాల నుంచి వచ్చిన వారే! అంటే ఈ సంఘాలు తమ పరిధిమేరకు సమాజ శోధక శక్తులను తయారు చేసే బృహత్ కర్తవ్యాలను నిర్వర్తిస్తున్నాయన్న వాస్తవాన్ని తప్పక గమనంలో వుంచుకొని తీరాలి.

నేడు బలంగా వీస్తున్న అస్థిత్వ వాదాల మధ్య సమాజ ప్రగతిని కాంక్షించే శక్తులు, సంస్థలు ఎంత పెరిగితే అంతమంచిది. నాస్తిక, హేతువాద తదితర సంఘాలు సమాజ ప్రగతిని మరొక అడుగు ముందుకు వేయించే ప్రణాళికలను రూపొందించుకొనే వైపుగా అడుగులు వేయాలి. ఈ అవగాహనా వెలుగులో దీర్ఘకాలంగా కృషిచేస్తున్న నాస్తికసమాజం వ్యవస్థాపక నిర్మాత చార్వాక రామకృష్ణగారి ఆదర్శవంతమైన కృషి గురించి చెప్పుకోవటం అవసరం.

నాస్తికసమాజం ప్రకటించుకొన్న ప్రణాళికలో "సమాజం సాంఘికంగా, ఆర్థికంగా అసమానంగా వుండటానికి వీలులేదు. ఉన్నవారు – లేనివారు, దోచుకొనేవారు–దోచుకోబడేవారు, పాలించే వారు – పాలించబడేవారు అనే పరిస్థితి పోయి, ప్రకృతి సంపద ప్రజలందరూ అనుభవించేలా, తమ శ్రమ ఫలితాన్ని తామే అనుభవించి ఆనందించే వ్యవస్థను రూపొందించుకొనే సమసమాజం ప్రజలు నిర్మించుకోవాలని ఆశిస్తూ నాస్తికోద్యమం అందుకు దోహదం చేయడమే గాక వారి ప్రజాతంత్ర పోరాటాల్ని ఉద్యమాన్ని బలపరుస్తుంది." అని ప్రకటించుకొంది. అంతేకాక తాను రూపొందించుకొన్న కర్తవ్యాల్లో ప్రథమ అంశంగా ప్రస్తుతం మనకు కన్పిస్తున్న దోపిడీ సంస్కృతిని, దోపిడీ సాంఘీక వ్యవస్థను నిర్మూలించి, శాస్త్రీయమైన, ప్రజా సంస్కృతిని, సమాజాన్ని నిర్మించడం, ఈ కార్యక్రమంలో కలసివచ్చే సాంఘిక, సాంస్కృతిక సంస్థలను, వ్యక్తులను సంఘటితపరచటంగా ప్రకటించుకొంది. సమాజచలనం గురించి, కర్తవ్యాలను గురించి ఇంత విస్పష్టంగా ప్రకటించుకోవడమేగాక, ఆచరణాయుతంగా చేసి చూపించిన అరుదైన సంస్థగా పేర్కొనాలి. ఈ ఉద్యమ సేనాధిపతే చార్వాక రామకృష్ణగారు.

ఈ సంస్థ ముఖ్యమైన ఆచరణాత్మక కార్యక్రమంగా 1992 నుంచి ప్రత్యామ్నాయ సంస్కృతి నిర్మాణంలో భాగంగా 'నాస్తిక మేళా'ను నిడమర్రు చార్వాక ఆశ్రమంలో రామకృష్ణగారి మరణం తర్వాత కూడా క్రమం తప్పకుండా నిర్వహిస్తున్నారు. అలాగే ప్రత్యామ్నాయ విద్యావిధానాన్ని నేర్పటానికి చార్వాక విద్యాపీఠంను 1973 నుండి రామకృష్ణగారు ఆఖరి శ్వాస విడిచే వరకు (2007, ఏప్రియల్ 18) అనేక ఒడిదుడుకులను ఎదుర్కొని నిర్వహించారు. సాంఘిక, ఆర్థిక పోరాటాలను బొమ్మ బొరుసులా నిర్వహించాలన్న శాస్త్రీయ అవగాహనతో నాస్తిక సమాజాన్ని, నడిపిన అరుదైన విలక్షణమైన భావ విప్లవకారుడు చార్వాక రామకృష్ణగారు. కమ్యూనిస్టు ఉద్యమానికి వందసంవత్సరాలు నిండుతున్నా నేటికీ ప్రత్యామ్నాయ విద్యావిధానాన్ని అచరణలో అమలు జరపలేకపోయారు.

నేడు అధికారంలో వున్న బిజెపి పార్టీని నడిపిస్తున్న ఆర్.ఎస్.ఎస్. అది ఆవిర్భవించిన నాటినుంచి దేశవ్యాపితంగా శిశు విద్యామందిరాలను ప్రణాళికాబద్ధంగా నడుపుతూ హిందూ

ఆధ్యాత్మిక భావాజాలాన్ని పిల్లలకు లేతవయసునుంచే నేర్పిస్తున్నారు. కమ్యూనిస్టుపార్టీలు చీలిపోయి బలహీనంగా ఉండటం కారణంగా ఈ కర్తవ్యాన్ని చేపట్టలేకపోవటం వాస్తవం కాదా!

సమాజ వికాసంకోసం తొలిదశలోనే అభివృద్ధి నిరోధక శక్తులు సృష్టించిన సమస్యలను ఎదుర్కొని తమ జీవితాలను త్యాగం చేసిన కపిలుడు, కణాదుడు, అసితకేశ కంబళుడు, మక్కలి గోశాలుడు, పాయసి, పెరియార్, త్రిపురనేని రామస్వామి, జ్యోతిబాపూలే – సావిత్రీ బాయిఫూలే, సామినేని ముద్దునరసింహం, బుద్ధుడు, అంబేద్కర్, కె.బి.కృష్ణ లాంటి మహనీయుల విగ్రహాలను నిడమర్రు చార్వాకాశ్రమంలో ప్రతిష్టించి తమ ఉద్యమస్ఫూర్తిని ప్రకటించుకొన్నారు.

అంటరాని, అణగారిన వర్గాల్లో చైతన్య దీపాలను వెలిగించిన జ్యోతిబా పూలే, సావిత్రీ బా పూలే, అంబేద్కర్ తదితర ప్రముఖులు నిర్వహించిన పాత్ర అద్వితీయమైనది. అలానే హేతువాద రంగంలో చార్వాకులు, పెరియార్ రామసామి, త్రిపురనేని రామస్వామి తదితరులు సాంఘిక దురాచారాలపై దండెత్తారు. మనుషుల్లో మానవత్వాన్ని పరిళమింపజేసిన కందుకూరి, గురజాడ, రాజారామ్మోహన్ రాయ్ లాంటి ఉద్దండులు సాంఘిక విప్లవకారులుగా వెలుగొందారు. ఈ శక్తులందరూ, వారి అనుచరులు భావవిప్లవ రంగంలో ఎనలేని కృషిని ఉద్యమంగా కొనసాగిస్తున్న ఫలితంగానే నేటి సమాజంలో భావ విప్లవరంగం ఆశావహస్థితిలో ముందుకు సాగగల్గుతున్నది.

కమ్యూనిస్టుపార్టీకి వంద సంవత్సరాలు నిండబోతున్న సందర్భంగానైనా తమ చీలికల ఫలితంగా పుట్టుకొచ్చిన అన్యవర్గధోరణుల బిడ్డలైన అస్థిత్వవాదాలు రాజ్యమేలుతున్న ప్రమాదాన్ని గమనించి పీడిత ప్రజలను పట్టి పీడిస్తున్న సమస్యల పరిష్కారం కోసం సంఘటిత ఐక్యపోరాటాలు సాగించటానికి నిర్ధిష్ట ప్రణాళికలు రూపొందించుకొని కదనరంగంలోకి దూకటానికి సిద్ధంకావాలి. అలానే సమాజాన్ని పట్టిపీడిస్తున్న కుల, మతోన్మాద, జాతీయ దురహంకారాలకు వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న ప్రజాస్వామ్య, ప్రజాతంత్ర శక్తులను, సంస్థలను హృదయపూర్వకంగా ఆహ్వానించి, అవి సాగిస్తున్న ఆందోళనలు, ఉద్యమాలకు పూర్తి సహాయ సహకారాలు సంఘీభావాన్ని అందించాలి. తాము వ్యవస్థ సమూల మార్పుకోసం సాగిస్తున్న జనతా ప్రజాస్వామిక విప్లవం మరింత పరిపుష్టంగా సాగించటానికి ఈ ఉద్యమాలను అక్షరాలా ఇముడ్చుకోగలగటమే నేడు విప్లవశక్తుల ముందున్న ముఖ్య కర్తవ్యం.

సిపిఐ, సిపియంలు వారి అగ్రనాయకులే చెప్తున్న విధంగా విడిగా ఉండాల్సిన అవసరం లేదో అలానే అనేక గ్రూపులుగా వున్న యం.యల్. పార్టీలు కూడా విడిగా ఉండాల్సిన అవసరం లేదు. రాజకీయ, సిద్ధాంతపరమైన ముఖ్యాంశాల్లో తేడాలుంటే ప్రజాసమస్యలపై ఐక్యకార్యాచరణ కొనసాగించటానికి ఆ విభేదాలు అడ్డురాకూడదు. అటు సామ్రాజ్యవాద శక్తులు, ఇటు బడా బూర్జువా, భూస్వామ్య దళారీ శక్తులు కూడబలుక్కొని ప్రజల మూల్గుల్ని పీల్చిపిప్పిచేసే విధానాలతో రాజ్యాలు ఏలుతున్నాయి. ఇలాంటి స్థితిలోనే సకల పోరాట శక్తులు ఐక్యమై దోపిడీ శక్తులపై శంఖారావం పూరించాలని ప్రజలు డిమాండ్ చేస్తున్నారు. ప్రజల డిమాండ్‌ను ఇప్పటికైనా ఉద్యమ శక్తులు శిరసావహిస్తాయని ఆశిద్దాం.

# ప్రజా సమస్యలు - పరిష్కార మార్గాలు

**– *సంగిరెడ్డి హనుమంతరెడ్డి***
ఆల్ఇండియా ప్రోగ్రెసివ్‌ఫోరం జాతీయకార్యదర్శి

**"నా శత్రువు** నోరెత్తకుండా చేయగల బలం, బలగం, అధికారం నాకున్నప్పటికీ తన అభిప్రాయాలు వెల్లడించే అతని స్వేచ్ఛను హరించను. అవి నాపై విమర్శలైనా సరే. అదే ప్రజాస్వామ్యం." – అబ్రహాం లింకన్. రక్తపాత పౌరయుద్ధ కాలంలో ఆయన అమెరికా అధ్యక్షుడు. నైతిక, రాజ్యాంగ, రాజకీయ సంక్షోభంలో దేశ ఐక్యతను కాపాడారు. బానిసత్వ నిర్మూలనకు పాటుపడ్డారు. సమాఖ్య ప్రభుత్వాన్ని బలోపేతం చేశారు. ఆర్థికాన్ని ఆధునీకరించారు. ప్రజాస్వామ్యానికి తూట్లు పొడవలేదు. మోదీ తాత్వికత, పాలన దీనికి పూర్తి వ్యతిరేకం. మతవాద పాలనతో ప్రజా పోరాటాల ఫలితాల పౌర, ప్రజాస్వామ్య, రాజ్యాంగ, మానవ హక్కులను కాలరాశారు. నియంతృత్వానికి, ఫాసిజానికి దారితీస్తున్నారు. హక్కుల రక్షణకు మరల పోరాడవలసిన దుర్గతి పట్టింది. అందుకు కలం పట్టిన రచయితలను, గళమెత్తిన మేధావులను, సామాజిక కార్యకర్తలను, పాత్రికేయులను, కళాకారులను హతమార్చారు. సమస్యల నిరోధానికి, తీవ్రత తగ్గింపుకు వ్యవస్థ మార్పుకు కమ్యూనిస్టులు, సంస్కర్తలు పోరాడతారు.

స్వాతంత్ర్య పోరాటం కుల మత జాతి సామాజిక ఆర్థిక స్థాయి భేదాలు మరచి ప్రజలందరూ పాల్గొన్న జాతీయోద్యమం. స్వాతంత్ర్య సమరంలో కులమత జాతి రహిత సమాజ నిర్మాణ ప్రయత్నాలు లేవు. రాజ్యాంగం అమలయిన 40 ఏండ్లకు ముస్లిం, దళిత, వెనుకబడ్డ తరగతుల సామాజిక న్యాయసాధనకు మండల కమిషన్ అమలయింది. మండల్ కమండల్ నినాదంతో మెజారిటీ మతస్తుల సమీకరణకు సంఘ్ పరివారానికి అవకాశం కల్పించింది. అదే సమయంలో నరసింహారావు ప్రభుత్వం ప్రపంచీకరణతో నూతన ఆర్థిక సరళీకరణ విధానాలు ప్రవేశపెట్టింది. ఈ సంస్కరణలతో సమ్మిళిత సామాజిక న్యాయం సాధిస్తానని చెప్పింది. బిజెపి అభివృద్ధి పేరుతో హిందూ సమీకరణ మొదలు పెట్టింది. సంప్రదాయ సమ్మతి మాటున హిందుత్వ జాతీయవాద నిర్మాణంలో విజయం సాధించింది. కాంగ్రెస్, ప్రాంతీయ పార్టీలు ప్రత్యామ్నాయ రాజకీయాలు మాని హిందుత్వ మెతక ధోరణులు పాటించాయి.

ప్రపంచీకరణ కొత్త సమస్యలను పెంచింది. మా సరుకులు లేకపోతే మీరు బతకలేరన్న అమెరికా బెదిరింపులకు మా సంత లేకపోతే మీ సరుకులు అమ్ముకోలేరని అనలేకపోయాం. దాసోహమై నాశనమయ్యాం. ప్రపంచీకరణ అవసరం తీరిన అమెరికా నేడు ప్రపంచీకరణ వద్దంటోంది. ప్రపంచీకరణలో సేవలు కార్పొరేట్ల వశమయ్యాయి. ప్రైవేటు విద్య సమాజ నిర్మాతలకు బదులుగా సామాజిక వ్యర్థ నష్ట పదార్థాలను తయారుచేసింది. ఆధునిక యాంత్రిక చదువరులకు దోపిడీ సమాజమే సౌకర్యంగా ఉంది. వాళ్ళు వ్యవస్థ మార్పుకోరరు. ప్రభుత్వ

తప్పుడు విధానాలతో కార్పోరేట్ల కబంధ హస్తాల్లో ప్రజారోగ్యం క్షీణించింది. అనారోగ్య భారతం ఉత్పత్తి శక్తిసామర్థ్యాలు కోల్పోయింది. డెబ్బైరెండేళ్ల స్వతంత్ర భారతంలో రాజ్యాంగం హామీ ఇచ్చిన సమస్యలే పరిష్కరించబడలేదు. పాలక పక్షాల కార్మిక సంఘాలు బలపడ్డాయి. సంఘాలు జీతభత్యాలు, సౌకర్యాలు, పదోన్నతుల కోసం పోరాడాయి. ప్రజావసరాలు పట్టించుకోలేదు. వాటి పోరాటాలు ఆర్థిక అంశాలతోనే ఆగిపోయాయి. సామాజిక, రాజకీయ చైతన్యం సాగలేదు. ఫలితంగా కార్మికుల ప్రవర్తనలో స్థిరత్వం లేదు. సమస్యల్లో, సమస్యల పరిష్కారం తర్వాత, కార్యాలయాల్లో, ఇంట్లో, స్వకుల మతస్తుల మధ్య వేరుగా ఉంటుంది. పురుషాధిక్య సమాజంలో పురుషులే కార్యసాధకులన్న అపోహ ఉంది. పోరాటాల్లో స్త్రీల పాత్ర తక్కువ. సగసమాజం విప్లవచర్యలకు దూరమైతే మార్పు సాధ్యమా? కుటుంబసభ్యుల సహాయసహకారాలు, ఆమోదమాన్యతలతో గమ్యసాధన సులభమౌతుంది.

విప్లవ పక్షాల్లోనూ సిద్ధాంతం సన్నగిల్లింది. వెసులుబాట్ల రాజీధోరణి పెరిగింది. గతంలో ప్రతి ప్రజాసంఘంలో, ప్రతి సామాజిక వేదికలో వామపక్ష భావాలు, ప్రగతిశీల ఆలోచనలు ఉండేవి. అధ్యయన రాహిత్యంతో ఈ ప్రహసనం తిరగబడింది. సంఘపరివార భావజాలం నట్టింట చొరబడింది. స్వభావ సమర్థన సిద్ధమైంది. క్రియాశీల పోరాటాలు, విప్లవం చర్చల్లో లేవు. వామపక్షాలు ముక్కలయ్యాయి. ప్రజాసంఘాలు, కార్మిక సంఘాలూ చీలాయి. విభజన వినాశం ఐక్యత నిర్మాణం. విడిపోవుట మరణం కలిసి ఉండుట జీవితం. వీటి మధ్య పరస్పర సహకారం పోయి, అసూయ, అనారోగ్య పోటీలు పెరిగి పెట్టుబడిదారీ వర్గాలకు దోహదపడుతున్నాయి. ఏ చీలికా గమ్యాన్ని చేరలేదు. ఎవరూ అసలు కారణాలు ఆలోచించరు. ఆత్మవిమర్శ, విమర్శల ప్రాధాన్యతను నొక్కిచెప్పిన లెనిన్ అందరికీ ఆరాధ్యుడే. కానీ ఆత్మవిమర్శ చేసుకోరు. విమర్శ సహించరు. ఎవరికి వారు తమదే సరైన పంథా, తామే అసలు విప్లవకారులమని వాదిస్తూ ఎదుటివారిని విమర్శిస్తూ నిందిస్తూ శత్రుపక్షాలకు సహకరిస్తుంటారు. మనం ప్రాతినిధ్య ప్రజాస్వామ్యంలో “ఎన్నుకోబడ్డ ప్రజాప్రతినిధుల” పాలనలో జీవిస్తున్నాం. చట్టాలు మనలను శాసిస్తున్నాయి. ఎన్నికల విధానాన్ని ప్రజాస్వామ్య పద్ధతులను, రాజ్యాంగాన్ని మార్చాలంటే ఆ ప్రక్రియల్లో పాల్గొనాలి. మార్పుకు ప్రయత్నించాలి. సామాజిక మార్పుకు సమాజంలో, సమాజంతో బతకాలి. పైగా విప్లవ గమన అయాచిత హింసతో ప్రజా వ్యతిరేకత పెరిగింది. యు.పి.ఏ. కుంభకోణాలు ప్రజావ్యతిరేక విధానాలతో 2014 నాటికి రాజకీయ అగాధం ఏర్పడింది. యు.పి.ఏ. పతనం ఖాయమని తెలిసి ప్రతిపక్షాలు జాగ్రత్త పడలేదు. ప్రత్యామ్నాయాలు ఆలోచించలేదు. ఈ నేపథ్యంలో గుజరాత్ ముఖ్యమంత్రిగా నిరంకుశత్వం, తిరోగమనం, మతోన్మాద నరమేధం, మతసమీకరణ, కార్పోరేట్ల అభివృద్ధిలో పేరొందిన మోదీ ముందుకొచ్చారు. మోదీ డొల్లతనాన్ని ఎవరూ ఎండగట్టలేదు. ఉన్మాద మోదీని ప్రధాని అభ్యర్థిగా ఎన్నుకునే ధైర్యం చేయగలిగింది బిజెపి. పూర్వ పాలనల్లో మంచి చెడు రెండూ ఉండేవి. ఇందిర, మన్‌మోహన్‌లతోనూ కొంత మంచి జరిగింది. మోదీ నిరంకుశ

పాలనలో మంచి దొరకదు. ప్రచారం చేసిన ప్రగతి డొల్ల. తస్మదీయ నరమేధం సర్వవ్యాపితం. ఊహించని సమస్యలు తలెత్తాయి. అధికార యంత్రాంగం, న్యాయవ్యవస్థ, శాసన నిర్మాణం, ప్రజాస్వామ్యం, రాజ్యాంగం, లింగసమానత్వం, హేతుబద్ధత, సామాజిక సంస్కరణలు, ప్రజాస్వామ్య రాజ్యాంగ సంస్థలు, మానవ విలువలు, ఆవిష్కరణలు, తర్కబద్ధ ఆలోచనలు, సమాజ సంబంధాలు దెబ్బతిన్నాయి. మతోన్మాద హింసలు, హత్యలు పెరిగాయి. మతప్రాతిపదికన సమాజం, దేశం చీల్చబడ్డాయి.

మోదీతో విభేదించిన, ప్రశ్నించిన వారిని దేశద్రోహులు, పాకిస్తానీయులని నిందించారు. హిందుత్వం, పరమత పరాయీకరణ, అసహనం, కక్ష, నిందాత్మక పదబంధాలు మోదీ షా ల ప్రత్యేకత. తాను ఇందిర, నెహ్రూలను మించినవాణ్ణని, గాంధీని తలదన్నే జాతిపితనని మోదీ నమ్మకం. దేశద్రోహ నిందలతో విద్యార్థులను, ఉపాధ్యాయులను జైళ్ళలో కుక్కారు. విద్యాసంస్థలను సంఘీయులతో నింపి హైందవభావజాల నిర్మాణ కార్యక్రమాలు చేపట్టారు. ప్రజాస్వామ్య రాజ్యాంగ వ్యవస్థలన్నీ ప్రధాని వశమయ్యాయి. ప్రభుత్వ సంస్థల్లో ఇంత పిరికితనం, అవకాశవాదం మునుపెన్నడూ లేవు. ప్రభుత్వాధినేత కనుసన్నల్లో మెలిగేవారు దేశాధినేతలయ్యారు. కోవింద్‌ను రాష్ట్రపతిని చేసి పీడిత దళితులను బురిడీ కొట్టించారు. దేశాధ్యక్ష, ఉపాధ్యక్షులు మంత్రివర్గం మోదీ రబ్బరు స్టాంపులే. మోదీ నేరాలు, అవినీతి, అక్రమాలు, అనాలోచిత చర్యలు, చట్టాలను సమర్థించే దుస్థితికి నెట్టబడ్డారు. మోదీతో పాటు పేర్లకు చౌకీదార్ పదాన్ని జోడించుకునేంతటి, అద్వాణి, మురళి మనోహర్ జోషి లాంటి సంఘ్ మార్గదర్శకులను అవమానించినా నోరెత్తని బానిసలు. గాడ్సె పూజ, గాంధీ, నెహ్రూల నిందల్లో వంతపాడుతున్నారు.

ప్రజాస్వామ్య పునాదులు కదిలిన వ్యవస్థలో అవినీతి పెరుగుతుందని, అప్రజాస్వామిక, అరాచక రాజకీయ శక్తులు లాభపడతాయని ట్రాన్స్పరెన్సీ ఇంటర్నేషనల్ వ్యాఖ్యానించింది. దేశ ఆర్థికవ్యవస్థ తిరోగమనం నుండి మాంద్యంలో ప్రవేశించింది. ప్రజల కొనుగోలుశక్తి వస్తు సేవల వినియోగం, పారిశ్రామిక ఉత్పత్తి తగ్గాయి. మోదీ అనాలోచిత చర్యలతో ఉద్యోగాలు ఊడాయి. ఉపాధులు నశించాయి. నిరుద్యోగం పెరిగింది. ఉద్యోగాలు, సేవలు తాత్కాలిక ఒప్పంద ఉపాధులయ్యాయి. మంత్రులు అశాస్త్రీయ అసత్య కారణాలు వల్లిస్తున్నారు. సంపన్నుల, కార్పొరేట్ల బంధువులు, పీడితతాడితజన శత్రువులయిన పాలకులు కార్పొరేట్లకు కానుకలు ఇచ్చారు. అనేక ప్రజావ్యతిరేక చట్టాలు చేశారు. ప్రభుత్వం దళితులు, ముస్లింలపై తప్పుడు కేసులు బనాయించింది. హిందు మతోగ్రవాదులు, గోరక్షకులపై కేసులు ఎత్తేసింది. దేశంలో పోలీసులు, న్యాయవాదులను అనుకూలంగా మార్చుకున్నామని మంగళూరు బిజెపి పూర్వ ఎమ్.ఎల్.ఎ. కె. జయరామశెట్టి అన్నారు. దేశవిదేశాల్లో విదూషక, విచిత్ర ప్రచార పటాటోపాలు పెరిగాయి. ఐనా లౌకికతత్వ ప్రచారం, ప్రజా ఉద్యమాలు నామమాత్రమే. విపక్ష ప్రత్యామ్నాయ, విప్లవ పక్షాలు ఏకతాటిపై దుష్టపాలకులను పోరాటాలతో ఎదుర్కొనలేదు.

విప్లవశక్తులు కూడా కులమతాలతో వివిధ పాలకపక్షాల అనుకూల వర్గాలుగా మారాయి. సామాన్య ప్రజలస్థితి చెప్పనక్కరలేదు. ఈ బలహీనతను పాలకులు చక్కగా వాడుకున్నారు. మెజారిటీ మతస్తులను మత మైనారిటీలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టారు. మీకు మేమున్నామని మెజారిటీకి హామీ ఇచ్చారు. మెజారిటీకి తలొంచకపోతే మీ బతుకులే ఉండవని మైనారిటీలను హెచ్చరించారు. ఓట్ల కోసం మత సమీకరణ చేశారు. దేశభక్తి భద్రతలతో మనోభావనలు కెలికి అధికార ధన మందబలాలతో మళ్ళీ అధికారం సాధించారు.

ప్రభుత్వం సర్వాధికారి, ప్రభుత్వ సంస్థలన్నీ పాలకుల అధీనం, నిరంకుశులకు అధికారాలు అనంతం. ఎంత బలమైన నిబద్ధత గల సంస్థ ఐనా రాజ్యంతో తలపడటం కష్టం. పాలకపక్షం గాక పాలితపక్షం వహించేది, నిజాన్ని నిర్భయంగా నివేదించేది పాత్రికేయత. వామపక్ష పత్రికలు తప్ప నేటి మాధ్యమాలు కార్పొరేట్ల సొంతం. కార్పొరేట్లు, ప్రభుత్వాధినేతలు, మతాధికారులు నీకిది నాకది (క్విడ్ ప్రో కొ) సూత్రంతో ఉమ్మడి ప్రయోజనాల కోసం కలిసిమెలిసి పనిచేస్తున్నారు. వార్తలు, కథనాలు, వ్యాసాలు, విశ్లేషణలు, వివరణలు, చిత్రాలు, వీడియోలు, సినిమాలు వీరి ప్రయోజనాలు కాపాడతాయి. సామాన్యుల, తాడిత పీడిత జనాల, కూలీల, అణగదొక్కబడిన తరగతుల, శూద్రుల, గిరిజన ఆదివాసుల, రైతుల, మహిళల సమస్యలు ప్రతిబింబించవు. చట్టసభల్లో ధనికులు, వాణిజ్యవేత్తలు, గుత్తేదారుల ప్రజావ్యతిరేక చట్టాలను ఈ పత్రికలు సమర్థిస్తాయి. ప్రజామోదాన్ని సంపాదిస్తాయి. ఛాందసాలను పోషిస్తాయి. అవినీతి, సామ్రాజ్యవాదాలను అందలమెక్కిస్తాయి. యుద్ధాలకు మద్దతిస్తాయి. హిందూ జిహాదీ మాధ్యమాలు బిజెపికి వీరవిధేయత, పక్షపాతం ప్రదర్శిస్తున్నాయి. యుద్ధాలకు మద్దతిస్తాయి. వార్తలను వక్రీకరిస్తున్నాయి. ప్రజాభిప్రాయ సేకరణ నిర్మాణం, ప్రచారాలలో ప్రజలకు హానిచేస్తాయి. మోదీ ప్రధాన స్రవంతి మాధ్యమాలను బహిష్కరించారు. ప్రభుత్వాలు కార్పొరేట్ల కొమ్ముకాశాయి. వీటితో మతం కలిసింది. మూడూ కలిసి ప్రజలను దోచుకుంటున్నాయి. ప్రజలు మత్తుల్లో ముంచబడ్డారు. మత్తుపదార్థాలు, మాదకద్రవ్యాలకు కులమతాల మత్తు తోడైంది. మతం మామూలు మత్తు కలిగిస్తుంది. అధికారమద మతమత్తు ఉన్మాదస్థితికి చేరుస్తుంది. నేటి సమాజం మతంతో కాషాయీకరించబడింది. గరళీకరించబడింది. సంపన్నులకు హక్కులే, బాధ్యతలు లేవు. సామాజికసంబంధాల వ్యాపారీకరణతో మనిషి మాయమయ్యాడు. కొందరు పక్షపాతంతో, కొందరు భ్రమభయాందోళనలతో, కొందరు అధికార కొనసాగింపుకు, కొందరు అధికార దురాశతో నిశ్శబ్ద స్తబ్ధతలు పాటిస్తున్నారు. మేధోనిశ్శబ్దం తీవ్ర హానికలిగిస్తుంది. సమాజాన్ని నిర్వీర్యపరుస్తుంది. నిర్వీర్యత మార్పును నిరోధిస్తుంది. విజ్ఞానశాస్త్రాలతో ఉన్నత పదవులు పొంది, శాస్త్రీయ ఆవిష్కరణలతో సుఖపడుతున్నవారికి శాస్త్రీయదృక్పథం లేదు.

సమాజంలో విరామం పెరిగింది. విరామసమాజం వినాశకర సామాజిక వ్యర్థ నష్ట జీవులను తయారు చేస్తుంది. సామాజిక రుగ్మతలు విజృంభిస్తాయి. ప్రజలు వ్యసనాలకు

బానిసలవుతున్నారు. స్త్రీలను బానిసలుగా చూస్తున్నారు. స్త్రీలు వంటింటి కుందేళ్లై ప్రత్యామ్నాయ పనులు లేక సమాజ వినాశక టివి సీరియల్లలో మునుగుచున్నారు. పిల్లలు తల్లిదండ్రుల అనుకరణలో స్మార్ట్ ఫోన్లు, టీవీ కంప్యూటర్లలకు బందీలవుతున్నారు. చదువులు, కుటుంబ జీవితాలు నాశనమవుతున్నాయి. విరామ సంపన్నులు విచ్చలవిడిగా ప్రవర్తిస్తున్నారు. విద్యార్థులు, యువతలో అవగాహన, ప్రశ్న, ఆలోచన, విశ్లేషణ, సృజనాత్మకత, అక్రమ వ్యతిరేక పోరాటాలు గతకాల జ్ఞాపకంగా మిగులుతున్నాయి. రాజకీయులు యువకులను ఎన్నికల్లో వాడుకుంటున్నారు. గత్యంతరంలేని యువకులు బిర్యానీకి, సారాకు లొంగుతున్నారు. ఈ “ఉపాధి” పోగానే అలవాట్ల కొనసాగింపుకు అసాంఘికశక్తులుగా మారుతున్నారు. తీవ్ర నిరుద్యోగం వారి భవిష్యత్తును, దేశప్రగతిని చీకట్లోకి నెడుతోంది. ఈ సంఘవ్యతిరేక శక్తులతో రాజకీయులు, వ్యాపారులు లబ్ధిపొందుతున్నారు.

మార్క్సిజం, లెనినిజం, మావోయిజం అన్నీ సోషలిజం, కమ్యూనిజాల లక్షిత విప్లవ మార్గాలే. విప్లవశక్తులు గమన విభేదాలు మరిచి గమ్యమే ప్రధానంగా పనిచేయాలి. సమస్యల పరిష్కారానికి వామపక్షాలు కలవాలి. బలహీన వామపక్షం సమాజానికి నష్టమని విజ్ఞుల అభిప్రాయం. అస్తిత్వ ఉద్యమాలు వామపక్షాలను బలహీనపరిచాయి. సిద్ధాంతులకూ కొంత సహజాత ఛాదస్తం ఉంటుంది. హీరోలైన అస్తిత్వవాద నాయకులు పాలక పక్షాల పంచన చేరారు. సమస్యల్లో కార్మికసంఘం పరిష్కారకేంద్రంగా ఉంటుంది. సమస్యలు తీరగానే సభ్యులు కులమతాలతో విడిపోతున్నారు. మతమౌఢ్యం తలకెక్కి శరీరమంతా వ్యాపించి మత పాలన నియంతృత్వంగా మారుతున్నది. విప్లవశక్తుల పునరేకీకరణతో సంఘటిత పోరాటాలు జరగాలి. అలౌకిక, అప్రజాస్వామ్య శక్తులను ఎదిరించాలి. సమసమాజం, మానవత్వం, కళలు, ప్రజాస్వామ్యం, రాజకీయ నిబద్ధత, రాజ్యాంగ పరిరక్షణ, లౌకికత్వం లక్ష్యాలుగా ప్రజల భాగస్వామ్యంతో, నైతికబలంతో సమాజ నిర్మాణం జరగాలి. ప్రజావాణి వినిపించి సమస్యలు పరిష్కరించేవారు, ఆకలి, దారిద్ర్యం, రైతులగోడు, మహిళా భద్రత, సామాజిక న్యాయం, ప్రభుత్వరంగాలను పట్టించుకునే వారు, అబద్ధాలాడక మాటపై నిలిచేవారు, యువశక్తిని దేశ నిర్మాణంలో సమ్మిళితం చేసేవారు, ప్రజాస్వామ్య రాజ్యాంగ రక్షకులు చట్టసభల్లో అవసరం. సమాజ అధోగతికి పాలక విధానాలే కారణం. సమసమాజం సరైన పరిష్కారం కాగలదు.

సమాజ సంస్కరణకు ప్రధాన స్రవంతులు రెండు. రాజకీయ స్రవంతి, భావజాల స్రవంతి. కొన్ని దేశాల్లో మన దేశంలో కొన్ని రాష్ట్రాల్లో కమ్యూనిస్టుల మెరుగైన పాలన గమనించాం. సత్సమాజ నిర్మాణానికి వామపక్ష సైద్ధాంతిక రాజకీయం కావాలి. చట్టసభల్లో వామపక్ష ప్రజాప్రతినిధులు పెరగాలి. విప్లవపక్షాలు సానుభూతిపరులను, సామాజిక కమ్యూనిస్టులను పెంచుకోవాలి. ప్రజాసంస్థల ప్రభుత్వీకరణకు కృషి చేయాలి. నిన్నటి తరం ఆత్మవిమర్శతో లోపాలు దిద్దుకొని నేటి తరానికి మార్గదర్శకం కావాలి. యువత వివాహానికి ముందే సామరస్య సమన్వయ దాంపత్య జీవిత విధానం, ఉభయ కుటుంబ బాధ్యతలు తెలుసుకోవాలి. పిల్లలను కనకముందే పిల్లల పెంపకం గురించి అధ్యయనం చేయాలి. తల్లిదండ్రులు, ఉపాధ్యాయవర్గం తమ బాధ్యతలు గుర్తించాలి. శాస్త్రీయ, ప్రగతిశీల, సామాజిక భావజాలాన్ని నిర్మించాలి.

చిలీ సామాజిక రాజకీయ శాస్త్రవేత్త, పాత్రికేయురాలు, క్రియాశీల కార్యకర్త, రచయిత మార్త హర్నెకర్ కమ్యూనిజాన్ని రాజకీయ, సామాజిక కమ్యూనిజాలుగా విభజించారు. సంఘ్ అనుబంధ సంస్థల సభ్యులకు సంఘ తాత్విక మాతృక, హిందూదేశ స్థాపన, పరమత శూన్యీకరణ సంఘ్ ప్రధాన లక్ష్యాలు. సంఘ్ సభ్యులు కానివారూ సామాజిక సంఘీయాన్ని ఆచరిస్తారు. సోషల్ కమ్యూనిజం సమాజ నిర్మాతలకు, మతతత్వం సమాజ నష్ట పదార్థాలకు ఉత్పత్తి కేంద్రాలు. పార్టీ సభ్యత్వంతో పూర్తికాల విప్లవకారులుగా పనిచేసేవారు రాజకీయ కమ్యూనిస్టులు. సభ్యులు కాకపోయినా కమ్యూనిస్టు పార్టీకి సహాయసహకారాలు అందించేవారు సామాజిక కమ్యూనిస్టులు. వీళ్ళ సంఖ్య తగ్గింది. విద్యార్థి సంఘ ఎన్నికల నిషేధం, చైతన్య కార్యక్రమాలు తగ్గటం, కమ్యూనిస్టుల చీలికలు ఇందుకు కొన్ని కారణాలు. పాలక పార్టీలు ప్రజలను మభ్యపెడుతున్నాయి. దీర్ఘకాల ప్రయోజనాలు ఫణంగా పెట్టి స్వల్పకాల రాజకీయ లబ్ది పొందుతున్నాయి. పథకాల అవకతవకలతో బలపడుతున్నాయి. రాజకీయులు తమ ప్రయోజనాలు కాపాడే పార్టీకి మారుతున్నారు. దోపిడీ సాగిస్తున్నారు. అమాయక ప్రజలు పెట్టుబడిదారీల స్వార్థానికి బలై పాలక పార్టీల వైపు మొగ్గుతున్నారు. భారత రాజకీయ పార్టీలు లౌకికత్వాన్ని నీరుగార్చాయి. సమాజంలో లౌకికత్వం మాయమయింది. హిందుత్వ రాజకీయాలకు, పరమతాలను ప్రక్కకు నెట్టడానికి, కాషాయ విషం చిమ్మడానికి అవకాశాలు దొరికాయి. అవకాశవాదం, అధికారదాహంతో కొందరు దళిత, ఆదీవాసీ, ముస్లిం, క్రైస్తవ మైనారిటీ రాజకీయులు తమ తాత్విక వ్యతిరేక బిజెపీని సమర్థించారు. సాటి భారతీయుల కష్టాలు గమనించి ఈ నాయకులు తమ రాజకీయ నిర్ణయాన్ని పునరాలోచించుకోవాలి.

నిన్నటి పనుల ఫలితం నేడు, రేపు నేటి ప్రణాళికల రూపు. ప్రత్యామ్నాయ పార్టీలు సమస్యల సమకాలీన గుర్తింపు, తక్షణ స్పందన, తగుచర్యలు, ప్రత్యామ్నాయాన్ని ఏర్పరచగల అవకశాలను అందిపుచ్చుకోవాలి. పోరాట రూపాలు మార్చాలి. బాధితులకు తెలియని, వివరణలేని వ్యతిరేక ప్రచారం ప్రత్యర్థులకు అనుకూలిస్తుంది. ప్రజాసమస్యల పరిష్కారదిశలో కలిసి రాగల పార్టీలన్నిటితో విశాల ఐక్యసంఘటన నేటి గత్యంతరం, ప్రత్యామ్నాయం ఏర్పడి, అధికారం అంది, పనిచేసే క్రమంలో "యోగ్యత, అనుకూలతలకే మనుగడ" అన్న ప్రకృతి సూత్రం పనిచేస్తుంది. గట్టి నిలబడి పొట్టు కొట్టుకుపోతుంది. పెట్టుబడిదారీ ప్రభుత్వాలన్నీ ప్రజలను మానసిక వికలాంగులుగా మార్చాయి. మోదీయం మతఛాందసులుగా మారుస్తున్నది. మానసిక బలోపేత, సైంద్ధాంతిక, తాత్విక గుణసంపన్న ప్రజానీకాన్ని తయారు చేయడం ప్రజాస్వామ్య, ప్రత్యామ్నాయ పార్టీల బాధ్యత. అదే కొత్త భారతం. బుద్ధిజీవులు ప్రజల అనుమానాలు తీర్చాలి. విషయాలు వివరించాలి. పేదరిక కారణాలు తెలపాలి. కట్టుకథల నుండి అమాయకులను కాపాడాలి. యువతను మత్తుముక్తం చేయాలి. దార్శనిక భావితరాన్ని నిర్మించాలి. ప్రజలను పోరాటాలకు సమాయత్తపరచాలి. పడతుల పోరాటాలకు చేయూతనివ్వాలి. సామాజిక మాధ్యమాలు వదిలి ప్రతిఘటనోద్యమాలు నిర్మించి నిర్వహించాలి. ప్రజాస్వామ్య శక్తులు బలంగా ఉద్యమించిన నాడు ఎంతటి శక్తివంతులైనా, బలమైన ప్రజాకర్షణ కలిగినవారైనా జవాబుదారీతనం లేని బూటక నాటకీయ నాయకులు తమ ఉన్మాదపు ఉచ్చులోనే ఇరుక్కుపోక తప్పదు.

ఇప్పుడు వామపక్ష ప్రచారంగా పేరు మోసిన కులమతవర్గ రహిత ప్రత్యామ్నాయమే గత్యంతరం. ఇది గుర్తింపు రాజకీయాలను మించిన ప్రజలందరిని సమీకరించగల వేదిక కావాలి. ఆధునిక సమాజ వృత్తిదారులు, కొత్త ఎగువ మధ్య తరగతి, పాత మధ్య తరగతి, పేద పీడితతాడితజన సమ్మిళిత సమాహారం కావాలి. వామపక్ష ప్రగతిశీల నాయకత్వాన సామాజిక సమానత్వ సాధనా పోరాటాలు సాగించాలి. సామాజిక భద్రత, ఉద్యోగ ఉపాధి కల్పనలతో ఆర్థిక సమానత్వ అవకాశాలు కల్పించాలి. నీతి నిజాయితీ నియమబద్ధ జీవన విధానాలతో ప్రజలందరిని ఏకం చేయాలి. పర్యావరణ భూతాప సమస్యల పరిష్కార మార్గాలతో బాధిత గ్రామీణ ప్రజలకు, రైతాంగానికి తోడుగా నిలవాలి. స్థానిక సంప్రదాయ సంస్కృతులతో కలిసి పయనించాలి. వాస్తవ చరిత్ర, భౌతిక ప్రపంచ స్థితిగతులను తెలపాలి. సంకుచిత జాతీయవాద మానవీయ దేశభక్తి తేడాలను ఆచరణాత్మకంగా ప్రచారం చేయాలి. మానవత్వ దృక్పథంతో ప్రజల మధ్య ప్రేమానురాగాలను, పరస్పర విశ్వాసాన్ని పెంచాలి. చైతన్య కార్యక్రమాలతో, పౌరజ్ఞానంతో విద్యార్థులను మంచి పౌరులుగా తీర్చిదిద్దాలి. భావజాల మార్పుకు, సమన్వయ సాధనకు, సమాజ శ్రేయస్సుకు యువతతో భావాలు పంచుకొని కలిసి పయనించగల నేర్పు, సమయం నేటి “పెద్దలకు” లేదు. సమాజం నుండి ప్రయోజనాలు పొంది ఉన్నత స్థితుల్లోనున్న ప్రజలు, ప్రగతిశీల సంఘాలు, ప్రజా రాజకీయ పక్షాలు ప్రత్యామ్నాయాలను నిర్మించి ప్రజలకు అందించాలి. నేటి భారత భవిష్యత్తు ప్రమాదకర పరిణామాల భయభరితం. బహుముఖ శక్తుల, కోణాల, రంగాల ఐక్యకార్యాచరణల అవసర సమయం. ప్రముఖుల సంతాపసభల్లో వాళ్ళులేని లోటు తీర్చలేనిదని అందరూ, వారి ఆశయాలు సాధిస్తామని కొందరు అంటూంటారు. ఈ కొందరి మాట అందరి మాటగా మారాలి. వాళ్ళ ఆశయాలను నిజంగా సాధించాలి. సమకాలీన సమాజ అవసరాలకు అనుగుణంగా ఆధునికత, యాంత్రికత, కృత్రిమ మేధస్సు, నవయుగ ఆలోచనల మేళవింపుతో మేలుకలయికతో అందరూ కలిసి పోరాడాలి. అదే నేటి పరిష్కార మార్గం.

“గత్యంతర రహిత చక్రాలపై దొర్లుతూ మార్పు తనంతటదే రాదు. నిరంతర పోరాటాల ద్వారానే మార్పు సాధ్యం.” మార్టిన్ లూథర్ కింగ్ జూనియర్. క్రియాశీలవ్యక్తులు, కార్మికసంఘాల కార్యకర్తలు, రాజకీయనాయకులు మాత్రమే పట్టించుకునే సామాజిక వ్యవస్థ నిర్మాణం, పరిధి, మార్పు ప్రయోజనాల గురించి సామాన్య ప్రజలు అధ్యయనం చేయాలి. క్యాపిటలిజం మరణమని, సోషలిజం జీవమని, జీవితమని, జీవనమని గమనించాలి. కాపిటలిజం అంటే ఉత్పత్తి సాధనాలపై ప్రైవేటు పెత్తనం. సంపదను సృష్టించే కష్టజీవుల శ్రమ దోపిడి. సాధించిన వాటిని పోగొట్టుకోవడం. వాటికోసం మరలా మరలా పోరాడినా తిరిగి సాధించుకోలేకపోవడం బాధగా ఉంది. బీట్రిక్ లంప్కిన్ చికాగోలో మాల్కోమ్ × కళాశాలలో గణితశాస్త్ర ఆచార్యులు. లాండ్రి, ఉక్కు పరిశ్రమ కార్మికుల, ఉపాధ్యాయ సంఘాలలో క్రియాశీలక కార్యకర్త. ప్రజలు సాధించి పోగొట్టుకున్న సౌకర్యాలను ఆమె పోరాడి పునరుద్ధరింపజేశారు. బీట్రిక్ లంప్కిన్‌లు ఆదర్శం కావాలి. ఆమె అమెరికాలో చేసిన పని మనం భారత్‌లో చేయాలి. పోరాడకపోతే సర్వం పోగొట్టుకుంటాం. మేధావులు చైతన్య కార్యక్రమాలు చేపట్టాలి. ప్రజలే మార్పు మార్గంలో పయనించి సమాజాన్ని మార్చాలి.

# వందేళ్ళ కమ్యూనిస్టు ఉద్యమం **సమీక్షకు ఇదే సమయం**

**- జయప్రకాష్**

**భారత** కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమై వందేళ్ళు పూర్తి కావొస్తోందని చెప్పడానికి ఇప్పుడు వీలులేదు. ఎందుకంటే తాష్కెంట్‌లో 1920 లోనే కమ్యూనిస్టు పార్టీ ఏర్పడిందని సీపీఎం చెబుతోంటే, మొదటి మహాసభ జరిగిన 1925 సంవత్సరాన్నే ప్రారంభంగా భావించాలని సీపీఐ అంటోంది. ఎంఎల్ పార్టీలు, ఇతర గ్రూపులకు కూడా ఈ విషయంపై భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఈ వివాదంలోకి పోకుండా భారత కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమై రేపో ఎల్లుండో వందేళ్ళు అవ్వనుందని అనుకుందాం. ఉద్యమం ఎప్పుడు ప్రారంభమయ్యిందన్న వాదన కంటే, ఆ ఉద్యమం ఇప్పుడు ఏ పరిస్థితుల్లో ఉందన్న వాస్తవ అంచనాకే అందరూ ప్రాధాన్యతనివ్వడం ఉపయోగకరం.

## వెలుగు.. నీడలు

కార్మిక, కర్షక, విద్యార్థి, యువజనులను సంఘటితం చేయడంలోను, వలసవాద దోపిడీకి వ్యతిరేకంగా వారిని ముందుకు నడిపించడంలోనూ కమ్యూనిస్టు ఉద్యమం నిర్వహించిన పాత్ర నిర్వివాదాంశం. స్వాతంత్ర్య పోరాటంలో ప్రేక్షకపాత్ర పోషించిన పరివారం, నేడు దేశభక్తి పాఠాలను వల్లెవేస్తోన్న సందర్భంలో ఈ చరిత్రకు మరింత ప్రాధాన్యత ఉంది. అదే సందర్భంలో, నాడు జాతీయ స్థాయిలో ఒక ప్రత్యామ్నాయ శక్తిగా ఆవిర్భవించిన స్థితి నుండి ప్రజలను ప్రభావితం చేయడంలో ఎన్నడూ లేనంత బలహీన స్థితికి వామపక్షం చేరడం ఒక కాదనలేని వాస్తవం. ఈ ప్రయాణంలోని లోటుపాట్లను సరిగా అంచనా వేయకుండా సరికొత్త ప్రయాణం ప్రారంభించడమూ సాధ్యం కాదు. కమ్యూనిస్టు ఉద్యమం చేసిన త్యాగాలను స్మరించుకుంటూ, సాధించిన విజయాలను నెమరువేసుకుంటూ పునరంకితమవుదామని ప్రతిజ్ఞలు చేస్తే సరిపోతుందా? చీలికలు, పీలికలు అవ్వడం వెనుక ఉన్న సైద్ధాంతిక సమస్యలను ఆకళింపు చేసుకుని, పునాదులను సరిచేసుకుని, సరికొత్తగా ముందుకు కదలాల్సిన అవసరాన్ని గుర్తించడమే ముఖ్యమా?? ఇదే ఇప్పుడు కీలక ప్రశ్న. మొక్కుబడి ప్రయాణానికే సిద్ధపడితే మొదటి పద్ధతే సరైంది. సరికొత్త సవాళ్ళకు, అంతకుమించి సరికొత్త అవకాశాలకు తగ్గట్టుగా కార్యాచరణను సిద్ధం చేసుకోవాలంటే మాత్రం రెండో పద్ధతే ఏకైక మార్గం.

## శత్రువెవరు..?

లోతుల్లోకి వెళ్ళినప్పుడు అనేక సైద్ధాంతిక సమస్యలు ఎంతో గంభీరంగా కనిపిస్తాయి.

ఆయా సమస్యల మూలం నుండి కాలగమనంలో కొంత ప్రయాణం జరిగినప్పుడు, వాస్తవాలు స్పష్టంగా కనిపించే పరిస్థితి ఏర్పడినప్పుడు, సులభమైన భాషలో చెప్పుకున్నప్పుడూ అవే గంభీర సమస్యలు ఆశ్చర్యకరంగానూ అనిపిస్తాయి. పార్టీ కార్యక్రమానికి సంబంధించి భారత కమ్యూనిస్టు ఉద్యమంలో నెలకొన్న సమస్యా అలాంటిదే. దేశంలో ఇన్ని కమ్యూనిస్టు పార్టీలు, గ్రూపులు ఎందుకు ఉన్నాయి అన్న ప్రశ్నకు సులభమైన సమాధానం ఏమిటంటే... దేశంలో పీడిత ప్రజలకు శత్రువెవరు? అన్న విషయంలో ఆయా పార్టీల మధ్య ఏకాభిప్రాయం లేకపోవడమే. దేశంలోని పెట్టుబడిదారీ వర్గం దళారీ పాత్ర మాత్రమే పోషిస్తోన్నందున సామ్రాజ్యవాదమే ప్రధాన శత్రువని కొందరు, సామ్రాజ్యవాదంతో తమ ప్రయోజనాల మేరకే రాజీపడుతూ, స్వతంత్రంగా వ్యవహరిస్తోన్న గుత్త పెట్టుబడిదారీ వర్గమే ప్రధాన శత్రువని ఇంకొందరు, మినహాయింపులు లేకుండా స్వదేశీ, విదేశీ, పెద్ద చిన్నపెట్టుబడిదారీవర్గమంతా శ్రామిక వర్గానికి వైరి వర్గమేనని మరికొందరు భావిస్తున్నారు. మరోవిధంగా చెప్పాలంటే ప్రధాన పోరాటం ఎవరిపైనన్న విషయంపైనే కమ్యూనిస్టు పార్టీలు నేటికీ ఒక ఉమ్మడి అవగాహనకు రాలేకపోయాయి. ఈ ప్రధాన సమస్యకు అనుబంధంగా అనేక ఉప సమస్యలు. అందుకే ఇన్ని గ్రూపులు. ఇటువంటి మౌలిక సమస్యపైనే ఏకాభిప్రాయం లేక ముక్కలు చెక్కలవ్వడం ఏవో కొన్ని పార్టీలు, గ్రూపులకు సంబంధించి కాక మొత్తంగా వామపక్ష ఉద్యమ సైద్ధాంతిక బలహీనతనే సూచిస్తోంది.

## మూలమెక్కడ...?

కోట్లాదిమందిని పోరాట పంథాలో నడిపించిన, లక్షలాదిమంది సమసమాజ సైనికులను తయారు చేసిన, వేలాది త్యాగధనులను తీర్చిదిద్దిన, వందలాది శ్రామికవర్గ ఉద్ధండ నాయకులు, మేథావులను రూపుదిద్దిన ఉద్యమం... నేడు ఇంతటి సైద్ధాంతిక గందరగోళంలో చిక్కుకుపోయి, బలహీనపడటానికి కారణమేమిటన్న ప్రశ్నకు ఎంతో ప్రాధాన్యత ఉంది. రష్యన్ విప్లవ స్ఫూర్తితో, వలసవాద వ్యతిరేక స్వాతంత్ర పోరాటంలో పురుడు పోసుకున్న కమ్యూనిస్టు ఉద్యమం.. ఆ తర్వాత తనదైన స్వతంత్ర కార్యక్రమాన్ని, పంథానూ రూపొందించుకోలేకపోయింది. రష్యన్ విప్లవం పాత్ర భారత ఉద్యమానికి స్ఫూర్తిని ఇవ్వడానికే పరిమితం కాలేదు. దేశంలో విప్లవ కార్యక్రమానికి సంబంధించి భారత ఉద్యమం రష్యా మార్గదర్శకత్వాన్ని కోరే పరిస్థితీ ఏర్పడింది. ఒక ఉజ్వల పోరాట విజయం తాలూకూ పరిణామమిది. ఈ క్రమంలోనే కమ్యూనిస్టు ఉద్యమ చీలికలకు బీజం పడింది. ప్రచ్ఛన్నయుద్ధ కాలంలో భారత్ వంటి తృతీయ ప్రపంచ దేశాలకు కృశ్చేవ్ ప్రతిపాదించిన "శాంతియుత సహజీవన విధానం" మరొక విపరిణామం. 90వ దశకం ప్రారంభంలో రష్యాలో కమ్యూనిస్టు పార్టీ పాలన అంతం అయ్యేవరకూ ఏదో ఒక

స్థాయిలో రష్యన్ విప్లవ ప్రభావం భారత ఉద్యమంపై కొనసాగుతూనే ఉందన్నది గమనార్హం. ఇదే విధంగా చైనా విప్లవ విజయమూ భారత వామపక్ష ఉద్యమాన్ని ప్రభావితం చేసింది. చైనా మార్గమా – రష్యా మార్గమా అన్న చర్చ నుండి, చైనా ఛైర్మనే మన ఛైర్మన్ అన్న నినాదం వరకూ జరిగిన పరిణామాల క్రమం తెలిసిందే.

మార్క్సిస్టు మూల సూత్రాలకు సంబంధించిన సాహిత్యం కూడా ఈ మొత్తం కాలంలో రష్యానుండే దిగుమతి అవ్వడమూ వాస్తవం. నేరుగా మార్క్స్, ఎంగెల్స్ మౌళిక రచనలను అధ్యయనం చేయడానికి బదులుగా రష్యన్ ఉద్యమం రూపొందించిన పాఠ్య గ్రంథాలపైనే భారత ఉద్యమం స్థూలంగా ఆధారపడటం ఈ క్రమంలో జరిగిన యాదృచ్ఛిక పరిణామం. వ్యవసాయిక విప్లవం, పెట్టుబడిదారీ వ్యవస్థ తీరుతెన్నులకు సంబంధించిన మౌళిక అవగాహన, ఒక దేశంలో సోషలిజం సాధ్యాసాధ్యాలు, పార్లమెంటరీ పంథా – పరిమితులు, కార్మికవర్గ అంతర్జాతీయత... ఇటువంటి ఎన్నో మౌళిక అంశాల పట్ల భారత ఉద్యమంలో ఒక శాస్త్రీయ మార్క్సిస్టు అవగాహన ఏర్పడకపోవడానికి తగినంతగా మూలగ్రంథాల అధ్యయనం లేకపోవడమే కారణమన్న విమర్శా ఉన్నది. వలసవాద వ్యతిరేక పోరులో పుట్టి పెరిగిన భారత కమ్యూనిస్టు ఉద్యమం తదనంతర కాలంలోనూ జాతీయవాద చట్రంలోనే కూరుకుపోయిందన్నది మరో ప్రధాన విమర్శ. ఫలితంగా, 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి' అన్న నినాదాన్ని ఆచరణలో పెట్టడానికి బదులుగా.. 'దేశ స్వావలంబన', 'మా దేహం ముక్కలైనా ఈ దేశాన్ని ముక్కలు కానివ్వం' వంటి జాతీయవాద నినాదాలు ముందుకువచ్చాయన్నది ఈ విమర్శ సారాంశం.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య వ్యవస్థలను నడిపించేందుకు రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో పాలక వర్గాలు సరికొత్త విధానాలకు, ప్రయోగాలకు శ్రీకారం చుట్టాయి. ఒక వ్యవస్థీకృత పెట్టుబడిదారీ ప్రజాస్వామ్య దేశంలో ఇప్పటివరకూ సోషలిస్టు విప్లవ ప్రయోగం విజయవంతమవ్వలేదన్న విషయం ఇక్కడ గమనార్హం. ఇటువంటి స్థితిలో, పాలక వర్గాల ఈ సరికొత్త ఎత్తుగడలను అధ్యయనం చేయడంలోను, వాటిని ఎదుర్కొనే కార్యాచరణను రూపొందించడంలోనూ వామపక్ష ఉద్యమం విజయం సాధించలేదు. ఇటువంటివి ఉద్యమ బలహీనతకు బాహ్య కారణాలు. స్థూలంగా ఈ బాహ్య, అంతర్గత కారణాలకూ లోతైన సంబంధముంది.

## వ్యవస్థ మార్పా? వ్యవస్థలో మార్పా ??

మౌళిక సైద్ధాంతిక, విధాన విషయాలపై అస్పష్టత, గందరగోళం నిండి ఉన్నప్పుడు స్థూలంగా కమ్యూనిస్టు ఉద్యమం దిశారాహిత్యానికి గురవ్వడమూ సహజ పరిణామం. భారత

వామపక్ష ఉద్యమంలో జరిగిందీ అదే. సైద్ధాంతిక స్పష్టత లేనప్పుడు ఆచరణలో ఐక్యత అసాధ్యం. అందుకే ఇన్ని గ్రూపులు, ఇన్ని అంచనాలు, ఇన్ని పంథాలు. ఉద్యమ ప్రారంభంలోని భౌతిక పరిస్థితులు (రష్యన్ విప్లవ ప్రభావం, వలసవాద వ్యతిరేక పోరాటం), పర్యవసానంగా ఏర్పడ్డ పలు సైద్ధాంతిక వైఖరుల కారణంగా భారత కమ్యూనిస్టు ఉద్యమ పయనం కూడా భిన్న లక్ష్యాలవైపు, విభిన్న పంథాల్లో కొనసాగుతోంది. ఫలితంగా ప్రతి కమ్యూనిస్టు పార్టీ తమది మాత్రమే నిజమైన కమ్యూనిస్టు ఉద్యమమని, మిగిలినవన్నీ మితవాద, అతివాద ఉద్యమాలేనని నిర్ధారించే పరిస్థితి ఏర్పడింది. ఆచరణలో అత్యధిక శ్రేణులు వ్యవస్థను సమూలంగా మార్చే లక్ష్యం స్థానంలో వ్యవస్థ లోపలే మార్పులు తీసుకువచ్చే లక్ష్యం దిశగా పయనిస్తున్నాయి. విప్లవ కార్యక్రమం ఆధారంగా పనిచేస్తున్నామని భావిస్తోన్న అనేక పార్టీలలోని సభ్యులకు, ఆచరణలో తమది సంస్కరణవాద కార్యక్రమమేనని తెలిసే పరిస్థితి కూడా లేదు.

## సమీక్షే ఒక కార్యక్రమం

కమ్యూనిస్టు ఉద్యమం బలహీనమవ్వడానికి కారణమేమిటన్న విషయంపై ప్రస్తుతం లోతైన చర్చ జరుగుతోంది. ఇక్కడ ప్రస్తావించిన అంశాలు చాలా పరిమితం. సారంలో చాలా ప్రాథమికం. వందేళ్ళ కమ్యూనిస్టు ఉద్యమాన్ని స్మరించుకోవడమంటే.. నిజమైన అర్థంలో, ప్రయోజనంలో లోతుగా సమీక్షించడమే. ఆ సమీక్ష ఆధారంగా సరికొత్త కార్యాచరణను రూపొందించుకోవడమే. వందేళ్ళ కమ్యూనిస్టు ఉద్యమ ఆచరణ అనేక విజయాలను సాధించినప్పటికీ... ఇన్ని గ్రూపులను తయారు చేసి, ఇంతగా ఉద్యమాన్ని బలహీనపర్చడం కళ్ళముందున్న వాస్తవం. ఫాసిస్టు ప్రమాదం ముంచుకురావడం కాదనలేని సత్యం. అమెరికా, బ్రిటన్ వంటి అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల్లో సైతం... మరోసారి పెద్ద ఎత్తున సోషలిస్టు భావజాలం (ఎన్నో పరిమితులు ఉన్నప్పటికీ) ముందుకురావడమూ చూస్తున్నాం. పెట్టుబడిదారీ వ్యవస్థ పురోగమనంపై నేడు ఎన్నో ఎన్నెన్నో సందేహాలు వ్యక్తం చేస్తున్నది కమ్యూనిస్టులు కాదు. ఆర్థిక సంక్షోభాలు, అంతులేని నిరుద్యోగం, తీవ్ర అసమానతలు, పర్యావరణ విధ్వంసం తదితర పరిణామాల నేపథ్యంలో పెట్టుబడిదారీ ఆర్థికవేత్తలు, మేధావులే ఈ వ్యవస్థ మనుగడను శంకిస్తున్నారు. మరోవైపు మార్క్సిస్టు వ్యతిరేకులూ మార్క్స్ వైపు చూస్తున్నారు. ఇటువంటి సవాళ్లు, సానుకూల పరిస్థితుల్లో భారత కమ్యూనిస్టు ఉద్యమం ఒక మెరుగైన కార్యాచరణను రూపొందించుకోవాలంటే, ముందుగా చేయవలసిన పని వందేళ్ళ ఉద్యమ అనుభవాలను విమర్శనాత్మకంగా సమీక్షించడమే. అందుకే, ఇప్పుడు సమీక్షా ఒక కార్యక్రమమే.

# కమ్యూనిజం ఒక భూతమా??? ఎవరికీ? ఎందుకనీ ?

**– హరజరత్‌అలీ**

“అందరికీ లాల్ సలాంలు.”
“ఇంక్విలాబ్ జిందాబాద్. జిందగీ ఫాయిందాబాద్.”
“విప్లవం వర్ధిల్లాలి.” “యునైట్– యునైట్. వర్కర్స్ యూనిటీ.”
“ప్రపంచ కార్మికులారా? ఏకం కండు”.
“విప్లవం యాడుందిరా? ఆడనే నీ కూడుందిరా? ఆడనే నీ గూడుందిరా?”
“ఉన్నవారికే అన్ని సుఖాలూ... అయ్యో! రయ్యో???
లేనివారిగతి, ఈ లోకంలో.. నుయ్యో, గొయ్యో??”
“మనిషన్నవాడు మార్క్సిజాన్ని అర్ధంచేసుకోకపోతే.. వాడి పుట్టుకే ఉత్త దండుగ.”
“ఇంతవరకు నడచింది. వర్గపోరాటాల చరిత్రే!”
“మానవ సమాజానికి మార్క్సిజమే జ్ఞానోదయం! సూర్యోదయం!”
“శ్రమ దోపిడీ ప్రపంచాన్ని మార్చేయాల్సిందే?”

అంటూ... ఈ గత రెండు శతాబ్దాలుగా వివిధ రకరకాలైన నినాదాలు వింటున్నాం. చూస్తున్నాం. ఉద్యమాలు ఉద్భవిస్తున్నాయి. పోరాటాలు జరుగుతున్నాయి. ఈ భూతం ప్రపంచాన్ని వదలలేదు. దోపిడీ ప్రపంచం తాను తల క్రిందులుగా నడుస్తూ, ఎదుటి వాడిని చూచి, “భూతం.. భూతం..” అని భయపడిపోతోంది. శతజయంతులూ, ద్విశత జయంతులు అంటూ ఉద్యమాలతో పాటు ఉత్సవాలూ జరుపుకుంటున్నాం. కానీ, మనం ఎక్కడ ఉన్నాం అంటే ‘వేసిన చోటే ఉన్నాం”. ఇంకా వెనక్కిపోతామంటారు కూడా మాలో కొందరు! మేం ముందుకి పోతాం. మునుముందుకు – పోదాం. పోదాం... పైపైకి? ఇంకెక్కడికీ? స్వర్గానికా? నరకానికా? ఫ్రాన్స్‌లో పూర్వం రాజుగారినీ, రాణిగారినీ కలిసి కట్టి, ప్రజలంతా తిరగబడి గిల్టెన్ యంత్రానికి బలిచేశారేమోగానీ, ఈ దోపిడీ భూతానికి బలియైపోయిన వీరాధివీరులు, సాధారణ కార్యకర్తలు, మేధావులు ఎందరున్నారు గదా? ఈ సమాజ మార్పుకై ఎంత రక్తం ఏరులై పారిందో? మూడడుగులు ముందుకు వేస్తే, ఆరడుగులు వెనక్కు వేస్తూంటాం. గోరానీ – గాంధీనీ సమానంగా ప్రేమిస్తాం! శ్రీశ్రీనీ భగత్సింగ్‌ని ఆరాధిస్తాం! బుద్ధుడినీ అంబేద్కర్‌నీ పూజిస్తాం. మోడీకి – సర్దార్ పటేల్‌కీ సలాంలు, సెల్యూట్స్ చేసేస్తాం! ఏ ఎండకు ఆ గొడుగులు పడ్తూంటారు కూడా కొందరు. అంబానీలనీ, భారత రాజ్యాంగాన్నీ సమానంగానే గౌరవిస్తాం! ప్రతి యేటా జండావందనాలు చేస్తాం. ఇలా ఉంటాయి ప్రజల నాల్కలు, చేతలు, గొఱ్ఱెమంద మనస్తత్వం! కమ్యూనిస్టు ఉద్యమాలు యూరప్‌లో పుట్టి, ప్రపంచమంతా వ్యాపించి 100–200 ఏండ్ల లెక్కలు గట్టి ఎగిరెగిరిపడ్తాం. సరే. ప్రజలయితే మారరు గాక మారరు. అధిక శాతం ప్రజలు గొఱ్ఱెమందలు. బానిసలు. శ్రమ దోపిడీకి తలలు వంచి, ఉన్నదానితో సర్దుకుపోయి, కుక్కలవలె, నక్కలవలె, పందుల వలె జీవిస్తాం అంటూ... ఆత్మ సంతృప్తి జెందుతుంటారు. విప్లవాలు నడిపినవారు మాత్రం ముందు నడిచి బలైపోతుంటారు. వారెంటనడచిన వారు, ప్రమాదాల్ని శంకించి తప్పించుకొని పోతుంటారు. ముందు ద్రోవతీసిన

వాడు బలిపశువు. మనం కూడా బలి అవ్వాల్సిందేనా? లేదు లేదు. బతికుంటే బలుసాకు తినైనా బ్రతకొచ్చు? పోదాం.. పోదాం ఇంకా వెనక్కి వెనక్కి – దెయ్యాల కొంపకి.. తిరోగమనం సాగిస్తూంటారు.

కమ్యూనిజం పుట్టి 200 ఏండ్లైనా ఈ దోపిడీ సమాజం ఏం మారింది? ఇంకా, ఇంకా, బలపడుతుంది! కానీ... ఈ పెట్టుబడిదారీ సమాజం కూడా తప్పక మారుతుంది. సమసమాజం ఏర్పడక తప్పదు. దోపిడీ వ్యవస్థ పతనం గాక తప్పదు. పెట్టుబడిదారీ సమాజానికి చివరి ఘడియలు వస్తాయి. ప్రపంచం సమ సమాజం వైపే నడుస్తుంది. ఎన్ని కష్టనష్టాల పాలబడ్డా, ఎందరు వీరాధివీరులు బలైపోయినా, ఎంత రక్తం ధారపోసినా, ఈ శ్రమజీవుల, కష్టజీవుల ధ్యేయం నెరవేరక పోదు. దానికి ఒక్కటే దారి. అది మార్క్సిజం. నక్సలిజం. కానీ, అది రావడానికి ఉత్త నినాదాలు చాలవు. ఆచరణ ముఖ్యం. నీతి సూక్తులూ, మావో సూక్తులూ, ఎన్ని ఉచ్ఛరించినా మంత్రాలకు చింతకాయలూ రాలవన్నట్లు ఉత్త కేకలకు దడిసి ఏ ధనిక వర్గమూ తమ సౌఖ్యాలను వదులుకోదు. ఆయాచితంగా పేదలకు సమసమాజం ఊడిపడదు. దానికి ప్రతి కమ్యూనిస్టు తాను చెప్పే ఆదర్శాల్ని పాటించాలి.

నేను గత 70 ఏండ్ల నుండి ఈ కమ్యూనిష్టు పోరాటాల్ని గమనిస్తూన్నాను. మేము చిన్నప్పుడు సమసమాజం కనుచూపు మేరలో ఉన్నదని ఎదురుచూశాం. కమ్యూనిష్టుగా మారడం, కమ్యూనిష్టుగా జీవించడం ఒక ఆదర్శంగా ఉండేది. నీతికి, నిజాయితీకీ, సత్యానికీ, న్యాయానికి, ధర్మానికి కట్టుబడి ఉండేవారు. కమ్యూనిష్టును చూచి భయపడేవారు. మోసాలకు, దోపిడీకి, కుట్రలకు, కుత్సితాలకూ, కులమతాలకీ, మూఢ విశ్వాసాలకీ, ఆచార వ్యవహారాలకి దూరంగా వుండేవారు. మార్క్సునే దేవుడిగా ఆరాధించేవారు. కమ్యూనిజమే జీవితానికి మార్గం అని ఊహించుకునే వారు. ఆదర్శ జీవితానికి నాంది పలికేరోజు వచ్చేసిందని మురిసిపోయేవారు. కానీ, అది అంతా తీవ్ర నిరాశకు గురిచేసింది. అన్ని పార్టీలలాగే ప్రజాస్వామ్యాన్నీ, ఈ దోపిడీ వ్యవస్థకు కట్టుబడి అందులో భాగమైపోయింది, అది తప్పని తెలిసీ మరో మార్గాంతరంలేక, కొత్తదారి ఏర్పడక, ఈ కుటిల సమాజంలోనే బలైపోతున్నారు. కానీ, ఈ సమాజం తప్పక మారుతుంది. దానికి ఎవరో వచ్చి ఉద్ధరిస్తారనుకోకుండా ప్రతి ఒక్కరూ ఈ వ్యవస్థ మార్పుకు తోడ్పడే కార్యక్రమాలు వ్యక్తిగతంగా చేపట్టాలి. సమాజం ఒక్కసారే 'ఛూ.. మహంకాళీ...' అంటే మారిపోదు. ఒక ఉధృత రూపం ధరించి, ఉద్యమ రూపంలో ప్రజా సమూహాలు మార్పు మార్గంలో పయనించాలి. దానికి కొన్ని ఆచరణాత్మక కార్యక్రమాల్ని చేపట్టాలి. ఈ క్రింది కొన్ని మార్గాలు ఆలోచించి ఆచరించ గలమేమో ప్రతి ఒక్కరూ ప్రశ్నించుకోవాలి. ప్రతి కుటుంబం మారితేనే, సమాజం మారేది! ఒక్కడు విప్లవకారుడైతే మారిపోదు. ఒక్కడి వల్ల అయ్యే పని కాదిది. ప్రయత్నించి చూద్దాం.

1. ప్రతి కమ్యూనిస్టు ఆదర్శ జీవితాన్ని ఆచరించాలి. కుల, మత బేధాల్ని ఎట్టి పరిస్థితులలో పాటించరాదు. తాము ఒంటరి వారమని తలంచకూడదు. ముందుకు మనం నడిస్తే మన వెనక నడిచేవారు చాలామంది ఉంటారు. శాస్త్రీయ ఆలోచనా విధానమూ, ఒక్క కమ్యూనిష్టుకే కాదు ప్రతి ఒక్కరి విధి. ఎందుకంటే మనం శాస్త్రీయ ఫలాల్ని అనుభవిస్తున్నాం గనుక.

2. ఇవి ఇంటి నుండే ప్రారంభించాలి : తమ పేర్లు మార్చుకోవాలి. ఏ దేవీ దేవతల పేర్లూ కమ్యూనిస్టులకు ఉండరాదు. ఏ రకమైన మూఢవిశ్వాసం, మూఢ భక్తి దరికి చేరనీయరాదు. గుడులూ, గోపురాలూ, తిరగడమే కాదు. పూజా పునస్కారాలూ, దీపారాధనలు మానివేయాలి– ఇతరులకు సాయపడటమే తమ విధిగా తలంచి మెలగాలి. ఇంట్లో స్త్రీ ముందుగా మారాలి. ఆమె ఆచరణ అలవాట్లను చూచి పిల్లలూ మారుతారు. ఆ తర్వాతే పెద్దలు, ఇంటి పొరుగువారూ, చుట్టూ ఉండే సమాజం, బంధుమిత్రులు మారుతారు. మనల్ని అనుసరిస్తారు.

3. అంటరానితనం, కులం, మతం గొప్పతనం, మహిమల మనస్తత్త్వం, మూఢ విశ్వాసాలు, భక్తి, మోసం, దోపిడీ, అన్యాయం, అసమానత్వంలను వదలివేయాలి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలూ, వ్యక్తిత్వపు గౌరవాదరాలు ఇంటిలో నుంచే ప్రారంభం కావాలి. స్త్రీ పురుష అసమానత్వం, బానిస మనస్తత్వం, యజమానిత్వం, వదలుకోవాలి. నేనే గొప్ప. మీరు నన్ను అనుసరించాలి అనే ఆధిపత్య గుణాన్ని వదలాలి. ఇంట్లో ప్రతి చిన్న విషయం అంతా చర్చించుకొని మంచి చెడ్డల్ని బేరీజు వేసుకొనే స్వేచ్ఛని కమ్యూనిజం ఇవ్వగలగాలి. యజమానత్వం కుటుంబంలోనూ పనికిరాదు. బాధ్యత ఏ ఒక్కరిపైనో వేసుకోరాదు. భర్తే భరించాలి, వాడు మగాడు సంపాదించేవాడు అనే భావన తప్పు అన్ని పనులూ అందరూ చేయాలి.

4. ఈ ధనిక, పేద, దోపిడి వ్యవస్థకు మన బానిస భావాలే కారణం అని తెలుసుకో గలగాలి. ఈ రోగాలకీ, అసౌకర్యాలకీ, కారణం మనమే! వేరే ఏ శక్తి మన చేత ఆ పని (కర్మ) మన మొఖాన రాసి ఉండి చేయిస్తుంది అంటూ తలంచడం సరి కాదు. మనకు మనమే బాధ్యులం అని ప్రతి ఒక్కరూ నమ్మి ఆచరించాలి. దేవుడికి కృతజ్ఞత తెల్పడం ఒక మూఢ విశ్వాసంగానే తలంచాలి.

5. ఈ ఆచార వ్యవహారాలూ, చావు పుట్టుకలు, వివాహం, మరణం, పండగలు – పబ్బాలూ, మత పరంగా చేసుకోకూడదు. బొట్టు కాటుకలు, వేషభాషలూ, చేతలలో సమానత్వం చేసి చూపాలి. అవి వేరుబాటను చూపుతుంటాయి. ప్రేమ, వాత్సల్యం, కరుణ, జాలి, దయ, సానుభూతులకు అందరూ అర్హులేనని తలంచాలి. స్త్రీల పనులు, పురుషుల పనులు అని విభజించడం చేయరాదు. అన్ని పనులూ కుటుంబంలోని ప్రతి వ్యక్తి అవసరం అయినప్పుడు నిశ్శంకగా చేయగలగాలి. ఇల్లు ఊడ్వడం, కడగడం, అలంకరణలు, వంటపని, బట్టలు ఉతకడం, పశుపోషణ, బిడ్డల వృద్ధుల సేవలు, రక్షణ, అందరూ ఒకేవిధంగా తమ బాధ్యతగా చేయగలగాలి. కష్ట నష్టాలు, ఆరోగ్య అనారోగ్యాలు, లాభనష్టాలు, మంచి చెడ్డలు, అన్నిటికి మనమే బాధ్యులమని తలంచాలి. పూజా పునస్కారాలు, కుల మత చిహ్నాలూ, ఆధిక్యతలు, అసమానతలు, ఏ రకంగానూ పాటించరాదు. ఎవరికి చేతనయిన పనులు వారు ఇష్టపూర్తిగా స్వేచ్ఛగా చేయగలగాలి. ధన సంపాదన బాధ్యత ఖర్చులు ఒక్కరి ఇష్ట ప్రకారం కాకుండా, సామూహికంగా చర్చించి నిర్ణయించాలి. ప్రతిరోజూ అంతా ఒక 5–10 ని.లు ఆనాటి కార్యక్రమాలపై చర్చించుకోవాలి.

6. కులాంతర, మతాంతర, ప్రేమ వివాహాలు, నిరాడంబరంగా జరిగేలా చూడాలి. ప్రతి వివాహం రిజిష్టరు చేయించాలి. ప్రతి నెలనెలా అంతా కలిసి విహారయాత్రగా ఒక నదీ తీరానికో, పార్కుకో కలిసి వెళ్ళి తీరాలి. పండుగలు, పబ్బాలు కొత్త విధానంగా స్వీకరించి

చేయగలగాలి. వ్యక్తుల జయంతులు, వర్ధంతులు, గొప్పవారి పుట్టుకలు, దేశభక్తికి సంబంధించిన పండుగలు, వివాహ దినోత్సవాలు, పుట్టిన రోజు పండుగలు మాత్రమే చేసుకోవాలి. ఇంకా బ్రతికియున్న వృద్ధుల సేవలకు సమయం కేటాయించాలి. అన్ని పనులూ అందరూ చేయగలగాలి. ఎవరి పని వారు చేసుకోవాలి. ఇతరులు తనకు సేవలు చేయాలని ఆశించరాదు. అది కమ్యూనిష్టు కుటుంబం. ఆదర్శయుతంగా జీవిస్తుంది. అవినీతికి తావుండదు. న్యాయానికీ, సమానత్వానికి, స్వేచ్ఛకి ప్రేమ గౌరవాలకి ఆలవాలంగా తలంచేలా మన ప్రవర్తనలుండాలి.

7. కమ్యూనిస్టులు తప్పక నాస్తికులై ఉండాలి. అది ప్రవర్తనలలో ఇంట్లో అందరూ ఇష్టపూర్తిగా పాటించగల్గి ఉండాలి. సమాజ మార్పుకి ఇది ప్రథమ కారణం. అర్హతకి, పరీక్షించదగినది. ఆదర్శజీవితానికి నాందీవాచకం. మన తల్లిదండ్రుల్ని, గురువుల్ని పెద్దలను గౌరవించాలను కోవడం కాదు. అందరూ అందరినీ గౌరవించాలి కానీ, ఎక్కువ తక్కువలు పాటించరాదు. పూజలు పునస్కారాలు, సాష్టాంగ నమస్కారాలు, పైపై ప్రేమలు, పైపై గౌరవాలూ, కౌగిలింతలూ, చేతులు కలపడాలు, అనవసరం. నిజమైన గౌరవాభిమానాలనే ప్రతిబింబించాలి గానీ, కావాలని నటించడం తగదు. ప్రేమ, వాత్సల్యాల్ని నటించకూడదు. వాటిని ఇతరులకు పంచాలి. అందుకు తిరిగి వారికి గానీ, ఇతరులకుగానీ, ప్రత్యుపకారాలు చేయగలగాలి.

8. ప్రతి ఒక్కరికి నేటి నాగరికతా చిహ్నాలు, సౌకర్యాలు, ఎవరివల్ల వస్తూన్నాయో, అడ్డంకులేవో, ఈ అసమానతలకు కారణాలేమిటో, అనారోగ్యాలకీ, అసౌకర్యాలకీ కారణాలు, వైజ్ఞానికంగా తెలుసుకోవాలేగాని, కర్మసిద్ధాంతాన్ని, దైవాన్ని, దయ్యాల్ని, విద్వేషాల్ని, జ్యోతిష్యాల్ని, వాస్తుని, చిలుక జోస్యాల్ని, దోపిడీ వ్యవస్థని నమ్మరాదు. సాటి మనిషిని, గౌరవించి తనకు సాయపడిన వారికి కృతజ్ఞతలు తెలుపాలి, దేవుడికి కాదు.

9. విగ్రహారాధనలు, ఆడంబరాలు, మత క్రతువులు, మతాధికారులు, పూజారీ వ్యవస్థలూ, లేని దేవుడికి సర్వసంపదలూ, ఆదాయాలు, తీర్థయాత్రలు, మొక్కుబడులు, చేతబడులు, అంటూ మత విద్యాలయాలు, మత వివాదాలూ వీటికి దూరంగా ఉండగలగాలి. కమ్యూనిష్టు సంస్కృతిని క్రొత్తగా ప్రవేశపెట్టగలగాలి. అది మళ్ళీ వేరేమతంగా రంగు పులుముకోకుండా జాగ్రత్త పడాలి. క్రొత్త సంస్కృతిని బలవంతాన పిల్లలకు నిర్బందించి నేర్పరాదు. మన ఆచరణ ద్వారానే వారు చూసి అనుకరించేలా చేయాలి.

10. ఇక మన పేరు చివర తగిలించే మతభావాల మాటలు శాస్త్రి, శర్మ, సాహెబ్, రెడ్డి, చౌదరి లాంటి తోకలు తగిలించుకోరాదు. అసలు మన పేరు మనము పెట్టుకోగలిగే వయసు వచ్చేదాకా ఆగి అప్పటిదాకా S/o, D/o అనే ఉంచుకొని, యుక్తవయస్సు నాటికి తమ పేరు తాము పెట్టుకోగలగాలి. పేర్లు పెట్టుకోవడం తల్లిదండ్రులది కాదు; మనదే! ఆ హక్కు. పదోతరగతి నాటికి తమ పేరు మార్పుని తామే ధృవీకరించుకోవాలి.

11. మతము – రాజకీయము, దేశభక్తి, పౌరసత్వము, వీటిని విడివిడిగా తలంచాలిగానీ, అన్నింటినీ ఒకేవిధంగా, ఒకే రూపంగా అందరినీ ఒకే గాటన కట్టేయడం తగదని నమ్మాలి.

కమ్యూనిజం ఒక కల కారాదు. మనమందరం కష్టం చేయాలి. ఫలితం అంతా సమానంగా అందుకోగలగాలి. హమ్ సబ్ ఏక్ హై ! ఇంక్విలాబ్ జిందాబాద్ !

# ముగింపు

"Even the most altruistic among us cannot act alone."

*- Tony Judt - ill Fares the Land*

పెట్టుబడిదారీ సమాజంలో స్వార్ధం విచ్చలవిడిగా రాజ్యం చేస్తుంది. కొందరి వ్యక్తిగత లాభాలకోసం, సుఖాలకోసం అత్యధికశాతం మంది అరకొరగా బతుకీడుస్తారు. దోపిడీకి చట్టబద్ధత కల్పించడమే ప్రజాస్వామ్యంగా చెలామణీ అవుతుంది. ఈ క్రమంలో సమానత కోసం జరిగే సమిష్టి యత్నం, అదెంత చిన్నదయినా చరిత్ర గమనంలో దానికొక విలువా, ప్రాధాన్యత ఉంటాయి. రోజురోజుకూ కొత్త కొత్త రూపాలలో పెచ్రేగిపోతున్న సాంస్కృతిక సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొనడానికి ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర ప్రయత్నాలు సైతం ఎక్కడికక్కడ జరగాలి. ఎవరి పరిమితుల్లో వాళ్ళు చెయ్యాలి.

అందులో భాగమే ఈ ప్రచురణ. ఒక నిర్దిష్టమయిన సైద్ధాంతిక తాత్వికతకి నిజాయితీగా కట్టుబడి, దశాబ్దాలుగా తెలుగురాష్ట్రాల సాంస్కృతిక వికాసానికి తన వంతు కృషి చేస్తున్న సంస్థగా 'చార్వాకాశ్రమం' మొదట్నుండి భౌతికవాద దృక్పథాన్ని అనుసరించి మాత్రమే ముందడుగు వేస్తోంది. ప్రపంచీకరణ ప్రభావంతో నిర్వీర్యమవుతోన్న యువతని సాంఘిక చైతన్యం దిశగా మళ్ళించాలనే సంకల్పంతో తన శక్తి మేరకు వివిధ కార్యక్రమాలు రూపొందిస్తూ పాటుపడుతోంది. అయినప్పటికీ కార్యకర్తల కొరతా, యువత భావోద్యమాల వైపు రాకపోవడం వంటి సమస్యల్ని అన్ని ప్రగతిశీల సంఘాలలానే చార్వాకాశ్రమం కూడా ఎదుర్కొంటోంది. ఈ పరిస్థితిని అధిగమించడం అవసరం.

మతాచారాలు, కులతత్వం, కొత్తరూపాల్లో పుంజుకుంటున్నాయి. నిత్య జీవితంలో నచ్చినట్టుండటం కూడా నేరంగా భావించబడుతోంది. ఎవరేం తినాలో, ఏం తొడగాలో, ఏం మాట్లాడాలో, చూడాలో, వినాలో, రాయాలో అన్నీ ముందే ఎంపిక కాబడుతున్నాయ్. ప్రసార మాధ్యమాలు వినాశకరమైన పాత్ర పోషిస్తున్నాయి. డబ్బూ, విలాసాలు, వ్యసనాలు, వ్యర్థత మాత్రమే వ్యవస్థని ఏలుతున్నాయి. సామాజిక స్పృహ, హేతుబద్ధమైన ఆలోచనా కలిగి ఉండటం అసాధారణంగా, అస్వాభావికంగా చూడబడుతోంది. దళిత బహుజనులు, స్త్రీలు, మైనారిటీల మీద దాడులు యధేచ్ఛగా జరుగుతున్నాయి. మానవత్వమనేది అదేదో మానవాతీత లక్షణమనే భావనగా మారింది. ఇలాంటి సంక్షోభ సమయంలో ఒకానొక చారిత్రక అంశంపై రూపొందించబడిన ఈ సంకలనం పరిమితమైందే అయినప్పటికీ ఒక స్పష్టమయిన లక్ష్యం, ప్రయోజనం కోసం వెలువడింది.

సమాజంలో ఈనాటికీ శ్రమదోపిడికి గురౌతూ, రోజూవారీ కష్టం చేస్తూ కూడా కడుపునిండని అభాగ్యుల పక్షం వహించిన అక్షరాల ఐక్య నినాదం సామ్యవాదం! ప్రపంచ పీడితుల పక్షాన మోగిన శంఖారావం శ్రామికుల, కార్మికుల, బహుజనుల రాజ్యం ఆవిర్భవించేంత వరకూ మూగబోదు. తాత్కాలిక విరామాలే కానీ శాశ్వత పరాజయాలు లేని చరిత్ర ప్రజాతంత్ర విధానానిది; ఆ స్ఫూర్తితో వెలువడిన ఈ పొత్తం చదివి పక్కన పడేయకుండా ఈ స్ఫూర్తిని ఆచరణాత్మకంగా కొనసాగించాలనీ, అందులో భాగంగా చార్వాకాశ్రమ ప్రయత్నాల్లో భాగం కాగలరని ఆశిస్తూ ముగిస్తున్నాము.

**– గౌరవ్**

## “ప్రపంచ కార్మికులారా! ఏకంకండు!”

ఈ వాక్యం గోడల నిండా అవకాశం చిక్కిన చోటల్లా వ్రాయబడుతోంది. ఇది తన్ను తాను అపహాస్యం చేసుకొంటున్నట్టుగా లోలోన కుమిలిపోతుంది.

తన్ను వాడుకొంటున్న రకరకాల ఎర్రజండాల రెపరెపల్ని చూచి దిగులుగా, దిగాలుగా వెర్రిమొగంతో పిచ్చి చూపులు చూస్తోంది. తన గతిని తాను తలచుకొని, తన దైన్యస్థితికి లోలోన కుమిలిపోతోంది.

అందరూ తనను సాంప్రదాయికంగా, అలవాటుగా, అలవోకగా వాడుకొనేవాళ్లే గానీ– తనమీద నిజమైన విశ్వాసంగాని, ఆప్యాయత గాని, అభిమానం గాని, గౌరవం గాని, దీక్ష గాని ఎవరికీ లేదే? అని లోలోన ఎంతో మధనపడిపోతోంది.

చివరికి తనను ‘బ్యానర్ల’ మీద రాసుకొని రెండు మూడు వర్గాలు ఊరేగింపుతో ఎదురై తన్నుకోవడం చూచి విస్తుపోతోంది. మతిపోయినట్లయి దిమ్మెరపోతుంది.

నేతి బీరకాయలా తన వ్యక్తిత్వం వ్యర్థమై, నిరర్థకంగా వాడబడటం ఘోరాతిఘోరంగా తయారుకావటం భరించలేకపోతోంది. కాని చేయగలిగేది లేక మిన్నకుండిపోతోంది.

సంస్కారహీనంగా తనను బయటకీడ్చి నగ్నంగా, నిస్సిగ్గుగా, బలాత్కారంగా తనను ఉపయోగించుకొనే రకరకాల ముఠాలను చూచి ఆ ముఠాల కుటిల బాహుబంధాలతో చిక్కుకొన్న అమాయకుల, సామాన్యుల స్థితి చూచి వెర్రిగా నవ్వుతోంది.

తనింత అపహాస్యం పాలుగావటానికి బాధ్యులెవరు? అని నిత్యము సందేహ మనస్కతతో కొట్టుమిట్టాడుతోంది.

“ప్రపంచ కార్మికులారా! ఏకం కండు” అనే తనలోనే లోపం వుందా? లేక పిచ్చివాడి చేతిలోని కత్తిలా తన్ను వాడుకొనే రకరకాల స్వార్థపరశక్తులు తననిట్లా నిరర్థకంగా మార్చి లోకానికి నేతి బీరకాయ లాంటిదాన్నిగా చూపుతున్నారా.

అణువణువునా, అడుగడుగునా ఐక్యతా రాహిత్యం వికటాట్టహాసం చేస్తూ రాజ్యమేలుతున్న ఈ సమయంలో తన వ్యక్తిత్వం ఎందుకూ కొరగానిదని తెలిసి – ఏకాంతంగా తన శీలాన్ని నడిబజారులో నవ్వులపాలు చేస్తుంటే చెప్పుకొనే నాథుడు లేక అనాదిగా అంగలారుస్తోంది. జీవచ్ఛవంలా బ్రతుకునీడ్చలేక బావురుమంటోంది.

కాని అందరూ ఐక్యంగా తననిట్లా చేస్తున్నందుకు తన వ్యక్తిత్వాన్ని మంటగలపటంలో ఐకమత్యంతో వున్నందుకు మూగ బాధతో సంతసిల్లుతుంది. తనకేనాటికైనా మంచి రోజులు రాకపోతాయా? అని సహనంతో, సంతోషంతో తలవొగ్గి నిజ స్థితి కోసం ఓ వేడి నిట్టూర్పు విడిచి చతికిలబడి గుడ్లు తేలవేసి చూస్తోంది.

**–చార్వాక రామకృష్ణ**